ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# తెలుగు శాసనాలు



రచయిత

శ్రీ జి. పరబ్రహ్మశాస్త్రి, ఎం. ఏ.




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాదు

ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# తెలుగు శాసనాలు





రచయిత

శ్రీ జి. పరబ్రహ్మశాస్త్రి, ఎం.ఏ.



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్,

హైదరాబాదు

# ముందుమాట

ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వసమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్ద లందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వ యుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూ ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహద కారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగుజాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన, తెలుగు ఉగాది రోజున, ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు.

ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియం) స్థాపించడానికి ఈప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజుల పాటు సాగుతవి. తెలుగు ప్రజల నంస్కృతి సంప్రదాయాలను విశదం చేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక నంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

**జలగం వెంగళరావు**
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975 వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో నివసించు చున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటైనది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు దాని కార్యనిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్య క్రమాల సమన్వయసంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా, సాహిత్య, కళా, చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వాహణకై 44 మంది సభ్యులుకల ఒక విద్వత్‌సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది ఆ విద్వత్‌సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప

వలసినదిగ ప్రపంచ తెలుగుమహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలత కొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ **తెలుగు శాసనాలు** అను గ్రంథమును, రచించిన శ్రీ జి. పరబ్రహ్మశాస్త్రి గారు ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన శివాజీ ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాదు
19-3-1975

# విషయసూచిక

| వ. నెం. | | పేజి. నెం. |
|---|---|---|
| 1. | తెలుగులిపి భాషల మొదలు | 1 |
| 2. | ధనంజయుని కలమళ్ళ శాసనము | 15 |
| 3. | ఎఱ్ఱగుడిపాడు శాసనము | 17 |
| 4. | పుణ్యకుమారుని తిప్పలూరి శాసనము | 21 |
| 5. | సత్యాదిత్య చోళుని మాలెపాడు శాసనము | 25 |
| 6. | అరకటవేముల శాసనము | 30 |
| 7. | వేల్పుచెర్ల శాసనము | 33 |
| 8 | గణ్డత్రిణేత్ర వైదుంబ మహారాజు–వన్దాడి శాసనము | 40 |
| 9. | కొండపఱ్ఱి శాసనము | 44 |
| 10. | కొరవి శాసనము | 48 |
| 11. | కొన్ని పద్యశాసనాలు | 71 |
| 12. | పణ్డరంగుని అద్దంకి శాసనము | 73 |
| 13. | యుద్ధమల్లుని బెడవాడ శాసనము | 75 |
| 14. | జినవల్లభుని కుర్క్యాల శాసనము | 78 |
| 15. | బణపతి దీర్ఘాసి శాసనము | 79 |
| 16. | గూడూరు శాసనము | 81 |
| 17. | ఉప్పరపల్లి శాసనము | 89 |
| 18. | పిరంగిపురము శాసనము లోని తెలుగు పద్యములు | 94 |
| 19. | చిడిపిరాళ్ళ శాసనము | 96 |
| 20. | ముగింపు | 98 |

# తెలుగు లిపి భాషల మొదలు

నాగరికత పెరిగినకొలది మానవుడు తన జీవితమును వైజ్ఞానికముగను, నైతికముగను మెఱుగుపఱచుచు ఆ విధానములను తరతరముల సంరక్షించుట తన కర్తవ్యముగ భావించెను. ఆ ప్రయత్నము లోనిదే లేఖన విద్య భారత దేశము నందీ విద్య యిప్పటికి ఐదువేల సంవత్సరములకు పూర్వము నాటి దనబడు సింధు నాగరికత నాటికే యొక సువ్యక్తమగు రూపము దాల్చి యున్నట్లు తెలియుచున్నది కాని యింతవఱకు ఆ లిపి సరిగా చదువబడ లేదనియే చెప్పవలెను. తరువాత చెప్పదగిన భారతీయ లిపి క్రీస్తు పూర్వము మూడవ శతాబ్ది నాటిదగు మౌర్యలిపి. అంతకు పూర్వమే వేదములు, వేదాంగములు, ఇంకాయెన్నో సూత్ర గ్రంథములు వెలసియుండుటను బట్టి యేదో విధమగు వ్రాత యుండెడిదని స్పష్టమగుచున్నది. అంతేకాదు. మౌర్య లిపి యనబడు అశోక శాసనములందున్న అక్షరములకన్న వేదసూత్ర వాఙ్మయ మందున్న అక్షర సంపుటి విశిష్టమైన దగుటచే దీనికి చెందిన లిపి అశోక లిపి కంటె విశిష్టమైనదని యెంచవలసి యున్నది కాని వేద, సూత్ర వాఙ్మయము లందు కానవచ్చు అక్షరములు, వాటి ఉచ్చారణ విశేషములు అన్నియు గురు శిష్య పరంపరగా వల్లెవేయబడుచు సంరక్షించబడినవేగాని వ్రాతతోగూడిన గ్రంథముల ద్వారా కాదని కొందరు చెప్పుదురు. అంతేగాక అశోకుని నాటి లిపి అతిసరళముగను సుగ్రాహ్యముగను ఉండును. ఉదా ; ࿈ = అ, ⁚ = ఇ ; ( = ఉ ; + = క 1 = ర ; మొదలగునవి. ఇట్టి ప్రాథమిక దశనుండియే భారతీయ లిపులన్నియు అనేక ప్రాంతీయ మార్పుల నొందుచు నేటి రూపము లను పొందినవని లిపి పరిశోధకులు భావించెదరు. ఏది యెట్లున్నను సింధు నాగరికత నాటి లిపిని అశోకుని మౌర్యలిపితో కలుపు రూపాంతరమును తెలుపు ఆధారము లేవియు ప్రస్తుతము లేవు. కనుక మౌర్య లిపియే మన తెలుగక్షరములకు కూడ మాతృక యయ్యెను.

కుబిరకుని భట్టిప్రోలు శాసనము, ఎఱ్ఱగుడి (జొన్నగిరి) గుట్టమీది అశోకుని శాసనములు ఆంధ్రదేశమునందలి మొదటి వ్రాతలుగ చెప్పబడు చున్నవి. ఆ లిపిని బ్రాహ్మీలిపి యనియు అందలి భాష ఒక విధమగు ప్రాకృత మనియు చరిత్రకారులు చెప్పుదురు. అప్పటినుండి అనేక పరిణామములు

కెందుచు శాతవాహన శకము దాటి ఇక్ష్వాకు, శాలంకాయన, బృహత్ఫలాయన, విష్ణుకుండిన, మాఠర వంశ్యుల రాజ్యకాలముల నధిగమించు నప్పటికి అనగా క్రీస్తు తర్వాత 500 ప్రాంతమునాటికి అంతవరకు చెల్లుచున్న ప్రాకృత, ద్రావిడ భాషలనుండి విడివిడి తెలుగుభాష యొక్క రూపునొందెను. ఇంకను ఒక శతాబ్ది గడచిన కాని శాసన భాషగ తయారు కాలేదనవచ్చును. అంతే అంతకుముందు తెలుగు భాష యే మాత్రము లేదనికాదు; ఉన్నది. కాని 'నాగబు', 'సంవత్సరంబుళ్' కొన్ని ఊళ్ళ పేర్లు మొదలగునవి. అచ్చటచ్చట శాసనములలోను, పొట్ట, అత్త, కరణి వంటి పదములు హాలుని గాథాసప్తశతి లోను కానవచ్చుటయేగాని, వాక్యరూపములో భాష కనిపించుటలేదు. తెలుగు భాష వాడుక యందుండి యున్నచో కొన్ని తప్పులతో గూడిన పద సముదాయములు శాసనములందు లభించెడివియే. అప్పటి రాజుల భాష ప్రాకృతము గనుక అప్పటి శాసనములన్నియు ప్రాకృతమునందే యున్నవను వాదమంత బాగులేదు. సామాన్య జనులు వ్రాయించిన చిన్న వాక్యముల శాసనములనేకములు అమరావతిలోను నాగార్జున కొండదగ్గర, మరికొన్ని చోట్ల దొరికినవి. అవికూడ ప్రాకృతమునందే యున్నవి. కనుక తెనుగప్పటికి జన సామాన్యమునందు కూడ ధారళముగ మాట్లాడబడు చుండెనను కొనుటకు ఆధారము లేవియులేవు. కాని అనేక దేశ్య పదములు వాడుకలో నున్న మాట నిజము. వారు మాట్లాడు వాక్యము లెట్లుండునో చెప్పుట కష్టము. మనకు తెలుగు వాక్యములు గల మొదటి శాసనములు కొన్ని కడప మండలములో కనిపించును. అవి ఆరవ శతాబ్దమునుండి వ్రాయబడినట్లు తెలియుచున్నది. అప్పటికి దేశములో వాడుకయందున్న బ్రాహ్మీ లిపినే కొలది మార్పులతో తెలుగువారు కన్నడమువారు వాడుకొనిరి. అందుచే దీనిని తెలుగు-కన్నడ లిపియని పరిశోధకులు చెప్పుదురు. కన్నడ లిపినుండి తెలుగులిపి కాకతీయుల నాటినుండి అనగ పన్నెండవశతాబ్ది నుండి వేఱుపడెను. అయినను ఈ రెండు లిపుల పోలిక మిక్కిలి సన్నిహితముగ నుండును.

**తెలుగక్కరములు :**

ముమ్మందు వ్రాయబడిన తెలుగు శాసనములలో కడప మండలము కమలాపురం తాలూకాలోని కలమల్ల శాసనము మనకు లభించెడి వాటిలో మొదటిదిగా భావింపబడు చున్నది. ఇయ్యది క్రీ. ఆరవ శతాబ్దికి చెందినట్లు కనబడును. కన్నడ మందప్పటికొక శతాబ్దికి పూర్వమే శాసనములు ప్రారంభ

మగుట గమనించదగిన విషయము. కనుక దక్షిణ భారతమున సంస్కృత-ప్రాకృత-ద్రావిడ సమ్మిశ్రమమునుండి వెలువడిన ప్రాంతీయ భాషలలో కన్నడము కంటె తెలుగు అర్వాచీనమై యున్నది. అప్పటి శాసనములను పరిశీలించుచో తెలుగుభాషలో గల అక్షర విశేషములు, పదవిశేషములు, వాక్య రచనా విధానము, సంధి, సమాస, కారక, విభక్తి మున్నగు వ్యాకరణాంశములే కాక ఉచ్చారణ సౌలభ్యమునకైన యితర మార్పులు అనేకము గోచరించును అందు అక్షరములను గూర్చి తెలిసికొందము.

అచ్చులలో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఒ అను నెనిమిది మాత్రమే గానవచ్చును. 'ఐ' కి బదులు అయి 'ఔ' కి బదులు అవు, అగు అనునవి వాడబడు చుండెను. శకము 898 నాటి, అనిమల శాసనములో 'ఐన' అని ఐ వాడబడెను. 'ఔ' అక్షరముయొక్క ఉపయోగము కనిపించదు. హల్లులలో వర్గాక్షరములందల్ప ప్రాణములు, అనునాసికములగు ఙ, ఞ, ణ, న, మ, లు విశేషముగ గానవచ్చును. య, ర, ల, వ, శ, స, హ, ళ. వర్ణములు వాడుకయందుండెను. కాగా ముఖ్యముగ గమనించవలసిన యక్షరములు మరికొన్ని ఆనాటి తెలుగులో కానవచ్చును. అందు శకట రేఫము ఒకటి. ఇది ఇప్పటి వరకు వాడబడుచున్నను ప్రస్తుతము దాని ఉపయోగము తగ్గిపోవుచున్నది. సుమారు క్రీస్తు పదవశతాబ్ద్యంతము వఱకు అనగా నన్నయ భట్టారకుడు గ్రాంథిక భాషను శాసించువఱకు శాసనములందు 'ఱ' అను రూపమున వ్రాయబడు అక్షరముండెడిది. ఇది బండి 'ఱ' లోని అడ్డు గీటును తొలగించి వ్రాసినట్లు శాసనములందు కనుపించును. దీనిని గూర్చి కీర్తిశేషులు జయంతి రామయ్య పంతులుగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు మున్నగు పలువురు పరిశోధనలు జరిపి అది మనకిప్పుడు వాడుకలో లేని వేరొక అక్షరమని నిర్ధారణము గావించిరి. అది క్రమముగా కొన్నిచోట్ల 'డ' గాను, కొన్నిచోట్ల 'ళ' గాను, మరికొన్నిచోట్ల 'ద' గాను మార్పునొంది అదృశ్యమైనట్లు చెప్పిరి ఈ సందర్భమున వారి అభిప్రాయ భేదములెట్లున్నను ఈయక్షరమొకటి పూర్వము తెలుగు భాషలో గలదని నిశ్చయముగ శాసనములను బట్టి తెలియుచున్నది. అది 'చోఱ' పదములలో 'చోడ' లేక 'చోళ' అనియు; 'నోఱంబ' పదములో 'నోళంబ' అనియు, ఱెందులూరు అనుచోట దెందులూరు గాను, క్ఱిన్ద అనునది క్రిన్ద (క్రింద) గాను 'క్ఱొచె' అనువదము 'క్రొచ్చె'; 'వ్ఱచె' అనునది 'వ్రచ్చె' అనియు మార్పునొందెను. ఈ యక్షరము

కన్నడములోకూడ చాల కాలముండినట్లు నిఘంటువు లందిదిగల పదములనేకములు చేర్చబడి యుండుట వలన తెలియు చున్నది తమిళమునందిది 'వాళైప్పళం' (= అరటిపండు) వంటి పదములలో వాడబడుచున్నదని కొందరు భావించెదరు. తెలుగు శాసనములలో చోఴ అని వ్రాయబడిన కాలమునకు చెందిన పుణ్యకుమారుని దొమ్మర సద్ద్యాల తామ్ర పట్టిక సంస్కృత శాసనములో 'చోళ మహారాజః చోళకేరళానామధిపతిః' అని 'ళ' కారము వ్రాయబడింది.[1] కనుక 'ఴ' అనేది తెలుగు భాషకి చెందిన అక్షరమే; సంస్కృతములో 'ళ' గనో 'డ' గనో మారుచుండెడిది.

ఇంకొక యక్షరము ఱ లేక ద̄* ఇది దంత్య 'థ' కారముగాదు పైజెప్పిన 'ఴ' కంటె రెండు మూడు శతాబ్దులు పూర్వమే యిది శాసనములందు సైతము ఉపయోగమునుండి తొలగెను. నన్నయభట్టు నాటికే యిది భాషలో లేదు. సంయుక్తాక్షరములలో 'న' 'ణ' తో కలసి యుండెడిది న్ఱ, ణ్ఱా. మూన్ఱు: చాణ్ఱా ద్̄లాకు, చదు̄ (మూడు, చాణ్డాలురకు, చెడు) మున్నగు పదములలో కానవగును. కలమళ్ల శాసనములో 'ధనంజయుదు̄ రేనాణ్డు, ఏళన్ చిఱుంబూరి రేవణకాలు....' అని దు̄, ఴలు రెండు వ్రాయబడి యుండుటను బట్టి ఱ, ఴలు భిన్నాక్షరములనవలెను అట్లే రామేశ్వరము (ప్రొద్దుటూరు) శాసన మొకదానిలో ఴ, ఴ. ఱ, డ, ళ, లు స్పష్టముగా వ్రాయబడి యున్నవి గనుక నవి యన్నియు భిన్నాక్షరములే యగును. పై జెప్పిన 'ధనంజయుదు̄' అను పదములోని దు̄ క్రమముగా న్ఱు, ణ్డు, ండు, ఁడు, డు, అనే ప్రథమా విభక్తి ప్రత్యయమైనది అట్లే వాన్ఱు అనేది, వాణ్డు, వాండు, వాఁడు, వాడు అని ఏక వచనంలో మార్పు చెందింది తమిళములోని 'అవన్' అనే యేకవచనము, 'అవర్' అనే బహువచనము తెలుగులో 'వాన్ఱు'-'వాణ్డు', 'వాడు' అనే యేకవచనరూపములు 'వాణ్డ్రు, వారు' అనే బహువచన రూపములు పొందినట్లు చెప్పినను, కలమళ్ల శాసనములోని 'ధనంజయుదు̄' అనేది 'ధనంజయురు' అని బహువచన రూపమో లేక 'ధనంజయుడు' అని ఏకవచన రూపమో

1. E. I. XVII P. 274 ll. 7-8

* తెలుగు లిపిలో ఇపుడు కనబడని ఈ అక్షరము, ఇకముందు, అకారము తప్ప తక్కిన అచ్చులు కలపవలసివచ్చినపుడు ద̄ అని ముద్రింపబడ గలదు; అటులకాక అకారాంత అక్షరముగ వచ్చినపుడును సంయుక్తమున వత్తుగ వచ్చినపుడును ఱ అని ముద్రింపబడగలదు. పాఠకులు దీనిని గమనింపవలెను.

తెలియదు. ఉరుటూరు శాసనములో 'చోటమహారాజు ల్లి ఏళ' అనే ప్రయోగం బహువచనంగా తోస్తుంది. రామేశ్వర శాసనములో 'చదు' (చెడు); అని యేక వచనాంతమునే తెలుపుచున్నది. అరకట వేముల (ప్రొద్దుటూరు తాలూక) శాసనములో వేంగుఋద్లు, పెన్త్రికాలు, నారకోళు, కంచద్లు ఇన్నల్వురుసాక్షి అని యున్నది. ఇందు పెన్త్రికాలు, అనే పదంలో త్రావడికూడ కనిపిస్తోంది కనుక ఈ ఠను ఱ అనటం బాగులేదు. ఇది వేరక్షరమే. పై జెప్పిన రామేశ్వర శాసనమందే చదుగట్టున్, చఠగట్టున్ అను రెండు ప్రయోగములు గలవు. వీటికి 'చెడు తగులును' అను నర్థము చెప్పవలెను. కనుక 'ఠ' అనేది 'డ' గా మారింది అంతేకాదు చెలచు, చెల అనే నేటి పదములలోని 'ల' పై 'చఠ' లోని 'ఠ' అగునా అని తోచుచున్నది. అందే చాణ్ఠాల్లాకు (చాండాలః) అను సంస్కృత తత్సమ పదము కలదు. 'చండాలురకు' అని దీని అర్థం చెప్పవలెను అదే శాసనంలో 'కొణ్డయ్య' అనే పదంలో 'ణ్డ' అనే మూర్ధన్య సంయుక్తాక్షరం వాడబడింది. కాని దానిలోనే 'మూన్థు (మూణ్డు) దంత్య సంయుక్తాక్షరం కనిపిస్తోంది. తమిళ అవన్ నుండి వాన్, 'వాన్డు' అయినట్లుగాక 'మూన్థు' అను తమిళపదమే మొదటి వాడుకలో నున్నది, తరువాత 'వాణ్డు' వలె 'మూణ్డు' అయింది.

'⊕' రూపములో మరొక అక్షరము ప్రాచీన తెలుగు శాసనాల్లో కనిపిస్తుంది. ఇది శకట రేఫమోలేక వేరక్షరమో ఇంకా నిర్ణయంకాలేదు. ఒకే శాసనములో ⊕ ఱ ట ఠ అను నాలుగక్షరములు కనిపించును. ఇందు మొదటి రెండు 'ఱ' యగునేమో. ఇంతవఱకు చెప్పినవిగాక సంస్కృత సంబంధము వలన మిగిలిన అక్షరములతో గూడిన నేటి తెలుగు వర్ణమాల యేర్పడెను.

సంయుక్తాక్షరములలో వర్గానునాసికములు వాడుటయందు తరువాతి కాలమందెక్కువ నియమము కనుపించును. ప్రాచీన కాలమున అట్టి వాడుక ఉన్నట్లు అంతగా తోచదు. రాజ్యంచేయ, ధనంజయు, రాచమానంబున, ఫలంబు, అశ్వమేధంబు, చిఱుంబూరు, కొట్టంబు, భుజంగ, వంగనూర్లి మున్నగునవి అనుస్వారమునే కలిగియున్నవి. 'న్' స్థానములో అనుస్వార రూపములు అంతగా అప్పుడు కనిపించవు. (వసన్తిపోరి, సామన్తకముళ్ వాన్థు, పాతకున్థు మున్నగునవి) అల్లే 'ణ' కూడ. వాణ్డు, కొణ్డయ, రెణ్డు, రేనాణ్డు, ఇత్యాది

రూపములేకాని అనుస్వార యుక్త రూపము లరుదు. మిగతా అనునాసికములకు బదులు సున్నలు బహుళముగా వాడబడచునే యున్నవి.

ఈ సున్నయొక్క రూపము ప్రాచీన బ్రాహ్మీలిపిలోను. మన తెలుగు లిపిలోను ఒక చుక్క ( • ) గా పరమందున్న అక్షరముపైన గుర్తించబడెడిది. అనునాసికము వాడుచో పరమందున్న అక్షరమునకు పైన వ్రాయుదుము గనుక దాని స్థానములో చుక్కను వాడినను అల్లే పరమందున్న అక్షరముపైన నుంచెడివారు. (ధనఞ్జయుదు = ధనంజయుదు; రాచమానమ్బున = రాచ మానబున. దేగులబు, వఴ, భుజగ, వేగు, వగనూరు, ఫలబు) కొంత కాలము నకు ఆ చుక్కయే చిన్న సున్నగా అక్షరము పైభాగముననే వ్రాయబడెడిది. ఇది సాధారణముగ చాళుక్యుల లిపిలో కాన్పించును క్రీ. 1124 నాటి గూడూరు శాసనమునందుకూడ నిల్లే యున్నది. ఇంక తెలుగులిపి ప్రత్యేకత నొందిన తర్వాత అక్షరము తర్వాత, అదే పంక్తిలో నిప్పటివలె సున్నపెట్టుట ఆచారమైనది. దీనికికూడ కొంత చరిత్ర కలదు. ప్రాచీనలిపిలో 'మ' కారము హల్మాత్రమే వ్రాయబడినచో 'ఠ' వ్రాసెడివారు. అంటే మ్=ఠ. ఇదే కాకతీయుల నాటికి పూర్వమే పై నున్న పొల్లు లేకుండ 'O' గా మారింది. మ్ = ఠ = O ఇటువంటిది అయిందన్నమాట. కన్నడలిపిలోకూడ నిదే విధముగా మారింది. క్రీ. 1100 ప్రాంతపు కందూరుచోళుల వొల్లాల శాసనములో సున్నకు బదులు 'ఠ' వాడుటకలదు. ఇల్లే మరికొన్ని శాసనము లందును దీని వాడుక కలదు. ప్రాకృత భాషా సంపర్కము తగ్గి సంస్కృత భాషా ప్రభావమెక్కువైనకొలది అనుస్వారమునకు బదులు వర్గానునాసికము లను వాడుట యెక్కువైనట్లు కనిపించును.

ఉదా :–డబ్కలవూణ్డి, సమరసఙ్ఘట్టణ, సమాలిఙ్గిత, పఞ్చమహాపాతక, రాజ్యఞ్చేయ, ప్రసాదఞ్చేసె, కుఞ్చెణ్డు, వసన్తీశ్వరము, వన్దిత, వసున్ధరాం, నేణ్టి, వైదుమ్బ, సమ్పన్నుణ్డు. మొద॥

ఉచ్చారణమునకు తగినట్లు వ్రాయుట చేతకాకపోవుట నేడుకూడ మనకు తెలుసు. భాషాంతరపదాలు వాడునపుడు మరీ కష్టము. Bank ను బంకు, బాంకు, బ్యాంకు, బేంకు అని వ్రాయుచుందుము కొరవి శాసనంలో వాయఙ్ బడిన అనే పదమిట్టిదే. *పొడిచిన* అనుటకు *పొడిచ్చిన*, ఆదాయంబు అనుటకు అదెయమ్బు వ్రాయుట, ఇవి అన్ని ఉచ్చారణ దోషములో వ్రాయుటలో తప్పులో చెప్పలేము రెండు ఆ నాడళ్లే ఉన్నవి.

కొన్ని విలక్షణోచ్చారణములు గల పదములు :

(శ్రీ)యైయరికొడుకు మరమ = (శ్రీ)అయితయారికొడుకు మారమ కావచ్చును. (ముద్దనూరు శా.)
నూట్టామ్బది = నూటయేమ్బది
అదెయమ్బ = ఆదాయమ్బు
కాడ్లి(వ్యేంగు = కాడ్ల వేగు (?)
సఘుత్తుదిగున్ = సంయుక్తుణ్డగున్.

సంధి విశేషములు

*1. పరరూపము ఏకాదేశమగుట*

వీరున్ణు + అయ్య = వీరున్ణయ్య...రాగిమడవనపల్లి శాసనము
ఉత్తమున్ణు + అయిన = ఉత్తమున్ణయిన...తిప్పల్లూరు
సిద్ధవటంబు + ఆడుచు = సిద్ధవటంబాడుచు...రామాపుర శాసనము
రేనాణ్డు + ఏలుచు = రేనాణ్డేలుచు...రామేశ్వరము
రాజులు + ఏళన్ = రాజులేళన్ ...చిల్మకూరు

వసన్తీశ్వరంబునాకు + ఇచ్చినది = వసన్తీశ్వరంబు నా కిచ్చినది... రామేశ్వరము. కాని దీనికి విరుద్ధముగ పూర్వరూపమే యేకాదేశమయినట్లు రెండు చోట్ల గలవు.

సంయుక్తున్ణు + అగు = సంయుకున్ణుగు...(ఇన్దుకూరుశాసనము)
మహాపాతకున్ణు + గు = మహాపాతకున్ణుగు...(వేల్పుర్తి శాసనము)

ఈ రెండు లేఖకదోషములేమోనని సందియము కలుగుచున్నది.

*2. యడాగమసంధి :*

దీని + ఆదాయమ్బు = దీని యాదాయమ్బు.. (బలవనూరు)
ఇరవది + ఆది = ఇరవదియాది ...(ఎఱ్ఱగుడిపాడు)
స్తితి + ఉ = స్తితియు

*3. సరళాదేశ-గసడదవాదేశసంధి :*

మూణ్డు + పుట్లు = మూణ్డువుట్లు...(బలవనూరు)

చదు + కట్టున్ = చదుగట్టున్ ...(రామేశ్వరము)
ఫలంబ + కాన్చున్ = ఫలంబుగాన్చున్ ,, ,,
పరబలంబు + పొడిచి = పరబలంబు బొడిచి...రాగిమడవనపల్లి
ఈస్థితిం + తప్పువారు = ఈ స్థితిదప్పువారు...(కొరవి)
వేయి + చెఱువుఌ = వేసెఱువుఌ (మాలెపాడు)

*4. ఇతర సంధులు :*

మూణ్డు + నూఱు = మున్నూఱు
మూణ్డు + తూము = ముత్తుమ్ము
ఇను + మారు = ఇమ్మారు; ఇమ్మడి
ఈ + మూణ్డు = ఇమ్మూణ్డు...రామేశ్వరము
ఈ + నల్వురు = ఇన్నల్వురు అరకటవేముల
పెద్ద + తెరువు = పెందెరువు
పెద్ద + చెఱువు = పెంజెఱువు

ప్రాచీన శాసనములలో సంధిని వివక్షచేయకపోవుటయే తరచు కనుపించును. రేనాణ్డు ఏళన్, సాతికను ఇచ్చిన; శ్రీధరయకు ఇచ్చిన నేల; పటుకాను;

**సమాసములు :**

అయా రాజులు వారి ప్రశస్తులలో ప్రసిద్ధమైయున్న సంస్కృత సమాసాలనే అధికముగా వాడుకొనెడువారు. సమరసఙ్ఘట్టణోపలబ్ధ జయలక్ష్మీ సమాలింగిత వక్షస్థల అని వైదుమ్బులు, జగత్త్రియాభివన్దిత సురాసురాధీశ వరమేశ్వర ప్రతీహారీకృత మహాబలికులోద్భవ' అని బాణరాజులు చెప్పుకొనేవారు. కాని రేనాటి చోళులు మొదట్లో ప్రశస్తులే చెప్పుకోలేదు. 'స్వస్తిశ్రీ చోడమహారాజుల్లేళన్' 'ఎరికల్ముతురాజు ధనంజయుడు రేనాణ్డు ఏళన్' అంటూ ప్రారంభంచేసి శాసన విషయము చెప్పేవారు. తర్వాత 'పృథివీవల్లభ విజయాదిత్య చోడమహారాజుళ్' అని పృథివీవల్లభ అని మాత్రమే చేర్చుకొన్నారు. కాని కొంత కాలం తర్వాత అంటే తొమ్మిదో శతాబ్దిలో వీరు 'చరణసరోరుహవిహిత విలోచన త్రిలోచన ప్రముఖాఖిల, పృథ్వీశ్వర కారితకావేరీతీర, కరికాల కులరత్న ప్రదీప, అహితాంకుశ' అనే ప్రశస్తిని మొదలుపెట్టిరి. కాని మొదటి రేనాటి చోళులు, ఈ ప్రశస్తిని చెప్పుకొనే అర్వాచీనచోళులు ఒకే

కుటుంబములోని వారో కాదో యింకా స్పష్టముగా తెలియదు. 6, 7, 8, శతాబ్దాల్లోని ప్రాచీన చోళ శాసనములు అతి క్లుప్తంగాను, చిన్న చిన్న తెలుగు పదాల్లో సంస్కృత-ప్రాకృతతద్భవాలో కలిగియుండెడివి గ్రామనామములు, ఏవైన బిరుదులు కొన్ని, రెండు మూడు పదముల సమాసములుగా నుండెడివి తాణ్ణికొణ్డ, తాడ్లపేవ, చిఱుంబ్రోలు, తర్కవుబ్రోలు, ఊరిస్వాముళ్, మార్పిడుగు, విడెల్విడుగు పెండెరువు, ముచ్చింతల, మున్నూళు, వేవాస్తు, పెఱ్నిధి, ఇన్నల్వురు, పొలగరుసు, రట్టుగుళ్ళు, రాచమానంబు, వీరుష్టయ్య.

సంస్కృత సమాసాలు యథాతథంగా వాడుకొనేవారు.

చరువశర్మ పుత్ర విన్నశర్మశాకు
పెర్బాణవంశ భుజంగది భూపాదిత్యులు. } అరకట వేముల శాసనము.

కౌణ్డిల్య గోత్రస్య పెన్బాఱ రేవ శర్మాణ పుత్రస్య అగ్గిశర్మాఌరికిచ్చిన దత్తి (చామలూరు శాసనము). అంటే వారికెట్లావస్తే అట్లా వ్రాసేవారు. ఇట్లాంటి సమాసాలను నన్నయగారు క్రమబద్ధంచేయటం తెలుగుతనానికి అపకారమో ఉపకారమో మరి ?

**పదజాలము :**

ద్రవిడ, కర్ణాట, ప్రాకృత భాషలనుండి అనేక పదములు తెలుగులో ప్రవేశించినవి సంస్కృతమునుండి తత్సమములు తత్భవము లనేకములు చేరుచున్నవి. కాని వాటినైన సరియగు విభక్తి ప్రత్యయములు చేర్చుకొని బహుళముగా వాడుకొనుట వారికింకా తెలియదు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, షష్ఠి, సప్తమీ విభక్తుల ప్రత్యయములే పరిమితముగా వాడబడెడివి. అవి కూడ మనకిపుడు ప్రసిద్ధముగానున్న (కారక) అర్థములతో వాడబడెడివికాదు సమాపక క్రియలకు బదులు క్రియాజన్య విశేషణములే అధికముగ వాడబడెడివి. ఇచ్చిన పన్నస, వచ్చినవారు, నిల్పిన శిల, పధిసిన వస్తు.

6, 7, 8 శతాబ్దములలో తెలుగు శాసనములందువచ్చు కొన్ని పదములు.

కొను = తీసుకొను
పట్టుకొను } ⟶ కఞ్చిగొణిన = కంచిని పట్టుకొనిన

రామాపుర శాసనము C. 700 AD.

ఏణ్డు = సంవత్సరము

నాణ్డు = దేశము (ప్రాంతము); నేడు (కాలము)

పాఱ = బ్రాహ్మణుడు

పాఱున్ = పోవును ... (రామేశ్వరశా.)

తేనికి } = దీనికి
దేనికి }

వేసెఱువుళు = వేయిచెఱువులు

మగణ్డు = వీరుడు, భటుడు — రాగిమడవనపల్లి

పసర(ము) = పశువు ? — ,,

వెళెయ = వెడలగొట్ట ? — ,,

పొడిచి పడిరెు = పొట్లాడి చనిపోయెు

పుట్లు = (కొలత)

తుమ్ము = (తూము).... — బలపనూరు

ప్రళు = ప్రాలు = బియ్యము

కుంచెడు = (కొలత)

నెయ = నేయి

ఉప్పు

పసులు = ఆవులు

ముదుణ్డు — ముద్దనూరు

వట్లు = (వడ్ల) .... — అనిమెల క్రీ. 976

పులయూరి = ? — రామేశ్వరము A.D. 700

కాన్చు = కను = పొందు

ఱచ్చు = డచ్చు = చెఱచు

చదు = చెడు—చన్దగు (కొఱ్ఱపాడు) — ,,

ట్కిన్దన్ = క్రిందన్ — ,,

నిల్పిన = నిలబెట్టిన — ,,

కొట్టంబు = (కోట ?) — ఎఱ్ఱగుడిపాడు

ఇచ్చిన

ఇరవది

కంచరి

కమ్మరి

పంపు = పంపున (ఆనతిన ... కలమళ్ళ C. 580

ఏళన్ = ఏలన్

అటికళా = ?

ఏంబది = 50 ఉరుటూరు 70

వక్రంబువచ్చు = అడ్డువచ్చు

కొచ్చియ = (కౌశిక, గోత్ర ?)

సమ్మార్గారు = కమ్మార (ఆర్య)

రట్టగుళ్ళు రామేశ్వర

రట్టకుట్ట ... వెల్దుర్తి

కాచి కుడిపిన వాస్తు ,,

వక్రవల్కినవారు

పారదాయ = (భరద్వాజగోత్ర ?) ... తిప్పలూరు 625. A D.

మఱున్న పిడుకు = (శత్రువులకు పిడుగువంటివాడు)

పటుకాను = స్థానముగాను : పట్టుగాను

పన్నవీస = పనాశ = పన్నస = దానముచేసినభూమి తిప్పలూరు 625. A.D.

పులొంబున = పొలంబున (విప్పర్ల శాసనంలోకూడ 'పులొంబున' అని కలదు.) రామేశ్వరము

రెణ్డు

తోటకు

అణతి = ఆజ్ఞ

మాఱ్పిడగు = శత్రువులకు పిడుగువంటివాడు

వేవురు

పరియారువు = పరిహారముగ నల్లచెరువుపల్లె

తేవుళ్ = దేవులు

కొఱొచె = క్రొచ్చె (శిలపై చెక్కుట) ....పఱికి — వ్రక్కి నల్లచెరువుపల్లె

క్రొచ్చె : ఱ → పూర్వాక్షరమున ంకారముగను, పరాక్షరమునకు ద్విత్వముగను మారును.

వఱచు = వ్రచ్చు

అఱిసిన = చెఱచిన

తాన్ధికొన్డ = తాడికొండ = అత్తివర్మ గోరంట్ల శాసనము

రేగొన్డ = విక్రమేంద్ర—చిక్కుళ్ళ శాసనము

కుస్తూరు = పోలమూరు శాసనము

వేయివఱకు అంకెలు వాడుచుండిరి. పుణ్యకుమారుని తిప్పలూరి శాసనమందు తిథి వార, నక్షత్ర, హోరలు చెప్పబడినవి గనుక వాటి పేర్లు బాగా తెలిసి యుండును

ప్రాచీన తెలుగు శాసనాలలో వాక్యరచన మన యిప్పటి దానికంటె కొంత విలక్షణముగ నుండును. ఏ భాష యందైనను వాక్యరచనకు ప్రధానముగ కారక నియమము పాటించుట ముఖ్యము. అనగా నేయే సందర్భములలో నేయే విభక్తి ప్రత్యయములతో నామవాచకములను క్రియతో నన్వయించవలెనో గమనించుట ఒక్కొక్క భాషలో నీ విధాన మొక్కొక తీరుగ నుండును. సంస్కృతములో 'చతుర్థీ సంప్రదానే' అని దానార్థమునందు చతుర్థి విధింపబడెను. 'విద్దశర్మణే గ్రామోదత్తః' అని వాక్యముండును. కాని తెలుగులో అదే వాక్యము వ్రాయుచో 'విద్దశర్మకు గ్రామ మివ్వబడెను' అని యుండును దానార్థములో బహుళముగా షష్ఠినే తెలుగులో వాడుదుము. దీనికి తెలుగు వ్యాకరణము రచింపబడక పూర్వమునుండి షష్ఠియే యిట్టి వాక్యములందు రూఢియై యుండుట కారణము. క్రొత్తగా భాష రూపొందునపుడు విభక్తి ప్రత్యయము అతిస్వల్పముగ నుండును. వాటిని మాత్రమే ఉపయోగించుచు వాక్యములను రచించెడివారు. కనుక స్థిరమైన భాష యగు సంస్కృతముకంటె తెలుగు భాష ప్రాథమిక దశలో చాలా తప్పులతో లక్షణ విరుద్ధముగ నుండెడిది. ఒకే రాజుచే వ్రాయించబడిన సంస్కృత శాసనములు తెలుగు శాసనములు పోల్చి చూచిన సంస్కృత శాసనములు సుబోధముగను తెలుగువి వక్తవ్యాంశము కూడ తెలియబడకుండగను ఉండును. పుణ్యకుమారుడనే రేనాటి చోళరాజుచే వొసగబడిన మాలెపాడు, దొమ్మరి నన్ద్యాల సంస్కృత శాసనాలు చక్కగా అర్థమగుచుండును. కాని ఆ రాజువే తిప్పలూరు,

రామేశ్వరములోని తెలుగు శాసనాలు అర్థమగుటలో కష్టముగ నుండును. అట్లే తూర్పు చాళుక్య రాజగు విష్ణువర్ధన మహారాజు యొక్క అహాదనకర శాసనము సంస్కృత భాగము సులభముగ నుండును. తెలుగు భాగము అర్థము కాదు. ఇట్టివి ఇంకా అనేకములు గలవు. అంతేకాక సంస్కృత శాసనాలు సాధారణముగా విద్వాంసులు వ్రాసెడివారు. కనుక కొంత మటుకు నిర్దుష్టముగనే యుండును. తెలుగు శాసనాలు ప్రజాబాహుళ్యము మాటాడు భాషలోనే యుండెడివి. కనుక గ్రామ్యమనవలెను. దానిని వ్రాయునపుడు అనేక లోపము లుండును. ఇప్పటి గ్రామ్యభాష నైనను వ్రాయవలెనన్నచో అనేక భేదము లుండును. ప్రాంతీయ భేదములేకాక ఉచ్చారణలో కూడ కొంచెం చదువుకొన్నవారు మాట్లాడునది వేరు, చదువు రానివారు మాట్లాడునది వేరు. అందుచే ఇట్టి భేదము లన్ని మనకు తెలుగు శాసనాల్లో కనుపించును.

తెలుగు భాషలో ఆఱవ శతాబ్దము వఱకు వాక్యరచన ఉన్నట్లు చెప్పదగిన ఆధారములు లేవు. అమరావతి ప్రాకృత శాసనాల నడుమ 'నాగబు', గాథా సప్తశతిలో పొట్ట, అత్త, కరణి మొదలగు పదాలు ఒకటి-రెండు శతాబ్దములనుండి వాడుకలో నున్నట్లు తెలియుచున్నను నాగార్జునకొండ శాసనాల్లోగాని మరి యితరచోట్ల శాసనాల్లోగాని ప్రాకృత భాషలోను, చెదురుగ సంస్కృత భాషలోను వాక్యము లున్నవేగాని తెలుగులో వాక్యములు 6వ. శతాబ్దిలోగాని కానరావు. అప్పుడప్పుడే ద్రవిడ, ప్రాకృత, కన్నడ, సంస్కృత పదాలలో నుండి కొన్నిటిని తీసుకొని తమకున్న పదజాలముతో జోడించి తెలుగు వాక్యములు వ్రాయుట మొదలు పెట్టుకొన్నట్లా ప్రాచీన తెలుగు శాసనాలను కొన్నిటిని చూడగ మనకు తెలియగలదు. అప్పటికే మాటాడు భాషలో తెలుగు వాక్యాలు ప్రాకృత వాక్యాల స్థానంలో విశేషముగ జొచ్చియుండును. కాని తెలుగులో వాక్యమును వ్రాయుట క్రీ. 575 ప్రాంతముదనబడు ధనంజయుడను రేనాటి చోళరాజు యొక్క కలమళ్ల శాసనమును బట్టియే మనకు తెలియుచున్నది. అంతకు పూర్వము రెండు శతాబ్దములనుండి కూడ యేకొద్ది వాక్యములో వాడుకలో నుండి యుండునని యూహించవచ్చును. మనకు మొదటి తెలుగు శాసనాలు కొన్ని రేనాడు మండలము (కడపజిల్లా)లోనే దొరుకుచున్నవి. అయినను సరిహద్దు జిల్లాలను విడిచి మిగిలిన తెలుగు దేశ మందంతటను అప్పటికి తెలుగు భాష

వ్రాత భాషగ పరిణమించినదని చెప్పవచ్చును. ఇప్పుడు కొన్ని శాసనాలను వాటి రచనా విధానమును పరిశీలించుదము.

వీటిలో అనేక పదములు దీర్ఘములకు బదులు హ్రస్వములు వాడుట, హ్రస్వములకుగాను దీర్ఘములు వాడుట, శ, ష, లకు బదులు 'స'ను వాడుట, ఋకార స్థానములో 'రి' వాడుట 'అ' కారమునకు బదులు 'ఎ' కారమును వాడుట మున్నగు ననేక వ్యత్యస్తములు నేడు వ్యాకరణాదుల దృష్టిలో అప శబ్దములని తోచును. అప్పుడప్పుడే మాటలు పలుకుట నేర్చుకొను శిశువులు తమ ఊహాలను ప్రకటించుట కెంతో శ్రమతో మాటలను వెదకికొనుచు తప్పులతో గూడిన అసంపూర్తి వాక్యములను ఎట్లు పలుకుదురో అట్లే యీ ప్రాచీనుల తెలుగు వాక్యము లుండును.

## 2. ధనంజయుని కలమళ్ల శాసనము.
## (సుమారు క్రీ. 575) - కమలాపురం తాలూక.

ఎపి. ఇం. XXVII - పు. 221.

1. ............
2. క ల్ము [తు]రా
3. జు ధనంజ
4. యుదు రేనా
5. ణ్డు ఎరిక న్
6. చిఱుంబూరి
7. రేవణకాలు [వం]
8. పు చెనూరుకాజు
9. అఱి కళా ఊరి [-]
10. ణ్డ వారు ఊరి ... ...
11. ... ... ... ... ...
12. ... ... ... ... ...
13. ... ... ... ... ...
14. ... ... ... ... ...
15. ... ... ... వఞ్చ [మ]
16. హాపాతకస
17. కు.

ఈ శాసనములో ఐ, ఱ, ఱ, డ (ణ్డు, ణ్డలలో) అక్షరము లున్నవి. 'వారు' అను బహువచనము కానవచ్చుచున్నది.

'ఎరికల్ ముతురాజు' అనే బిరుదుగల ధనంజయుడను రాజు రేనాణ్డు ఏలుచుండగా చిఱుంబూరు అనే గ్రామానికి చెందిన రేవణ అను పేరుగల 'కాలు' ఒక ఉద్యోగి (లేక ఆసామి) యొక్క పంపున చెనూరి గ్రామానికి చెందిన 'కాజు ... ... ... ...' అని వాక్యమసంపూర్తిగ నున్నది. తుదిలో పంచమహాపాతకుడగునని యీ ధర్మమును చెడగొట్టువారికి పావము చెప్పబడెను. ఈ శాసనములో భాషా విషయకముగ విశేషములు తెలుసుకొను అవకాశ మంతగా లేదు.

ఎరిగల్ అను నగరము వీరి కొకప్పుడు రాజధాని యగుటమబట్టి యీ రాజులలో కొందరికి ఎరిగల్ ముతురాజు, ఎరిగల్ దుగరాజు అను రాజ బిరుదము లుండెడివని దీనిని ప్రకటించిన కీ. శే. ముట్లూరి వెంకట రామయ్య గారు, ప్రొఫెసర్ కె ఎ. నీల కంఠశాస్త్రిగారు చెప్పిరి. మహారాజు, మహా రాజాధిరాజు, యువరాజు (దుగరాజు) అను పదములు రాజపదవులలో ప్రభేదములను తెలుపునట్లే ముత్తురాజు పదముకూడ నొక భేదమును తెలుపునని వారు చెప్పిరి

# 3. ఎఱ్ఱగుడిపాడు శాసనము.

## (క్రీస్తు. 600 ప్రాంతముది.)

ఎపి. ఇం. XXVII పు. 225.

ఇది కూడ కమలాపురం తాలూకాలోనిదే.

**మొదటివైపు**

1. స్వస్తిశ్రీ ఎరిక
2. ల్ముత్తురాజుల్ల
3. కుణ్డికాళ్లు నివబుకా
4. ను ఇచ్చిన పన్నస [11*]
5. దుజయ రాజుల
6 ముత్తురాజులు నవ
7. ప్రియ ముత్తురాజులు
8. వల్లవ దుకరజులు కఱ
9. కాను ఇచ్చి [న*] పన్నస్స [11*]

**రెండవవైపు**

10. కొట్టంబున పా
11. పాఱకు కుణ్డికాళ్లు
12. శా ఇచ్చిన పన్నస
13. ఇరవది యాది నా
14. ల్కు మఱు స్తుద్లునేల [11*].

ఇందు 'పాఱకు' అను మాటలో శకటరేఫము, 'మఱు స్తుద్లు' అను మాటలో 'ఱ'తోబాటు 'ఠ' కూడ వాడబడెను.

ఈ శాసనంలో సమాపక్రియ లేకున్నను క్రియాజన్య విశేషణముతో గూడిన కర్మాంత వాక్యములు మూడు కలవు. శాసనము పూర్తిగ లభించుచున్నది కనుక కొంత పరిశీలింపదగి యున్నది.

1 ఎరికల్ముత్తురాజుల్ల కుణ్డికాళ్లు నివబుకాను ఇచ్చిన పన్నస-అని మొదటి వాక్యము. ఈ వాక్యములో 'నివబుకాను' అను భాగ మర్థమగుట లేదు. 'నివంబుకాము' 'నెవంబుకాను' 'నెవంబుకాను' అని దీనిని ప్రకటించిన పై చెప్పిన విద్వాంసులు కొంత సరిపెట్టిరి ప్రస్తుతము మనకు వేఱర్థము తోచుటలేదు గనుక దానినట్లే యంగీకరింతము. 'ఎరికల్ముత్తురాజుల్ల' అనునది ప్రథమాంతమో షష్ఠ్యంతమో తెలియదు. 'కుణ్డికాళ్లు' అనునది ప్రథమాంతమే. రాజుయొక్క కుణ్డికాళ్ళు (ఉద్యోగి) నివంబున (=రాజుగారి పేర?) పన్నస (=భూమిదానము) ఇచ్చిన భూమి యిది అని ఆ శాసనశిల యున్న పొలమును నిర్దేశించును. ఇట్లుకాక ఎరికల్ముత్తురాజుల్ల అనుదానికి ఎరికల్ముత్తురాజు రాజ్యకాలమున అని వారు చెప్పిరి. అపుడు 'నివంబున' అనుదాని కర్థము వేరుగ చెప్పవలయును.

2 దుజయ రాజుల ముత్తురాజులు, నవప్రియ ముత్తురాజులు, వల్లవదుకరాజులు అను ముగ్గురు సాక్షిగ ఇచ్చిన పన్నస (ఇది)-అని రెండో వాక్యము సమాప్తమయ్యెను దుజయ (దుర్జయ) రాజు యొక్క (పుత్రుడగు) ముత్తురాజు ఒక సాక్షి ముత్తురాజనునది యొకానొక రాజపదవి అంటిమి గనుక ఈయన పేరిందు లేదు దుర్జయరాజు అనునది తండ్రి పేరు. ఈ సాక్షి పేరు వ్రాయలేదన్నమాట రెండవ సాక్షి నవప్రియ ముత్తురాజులు. నవప్రియుడనే పేరుగల యొక రాజకుమారుడు. మూడవ సాక్షి వల్లవ దుకరాజులు. వల్లభుడనునది మరల బిరుదనే తోస్తుంది అయినను ఆ బిరుదుగల దుకరాజు (దుగరాజు = యువరాజు) అని చెప్పవచ్చు. 'క' 'గ' లకు 'త' 'ద' లకు ఆనాడంత భేదముండెడిదికాదు. తుగరాజు, దుకరాజు, దుగరాజు, అను పదాలు యువరాజను అర్థములో వాడిన తావు లనేకము గలవు ఈ విధముగ తండ్రి పేరుతో మాత్రమే ఒకసాక్షియు బిరుదు పేర్లతో మిగిలిన ఇద్దరు సాక్షులును చెప్పబడిరి.

3 కొట్టంబున పాలుకు కుణ్డికాళ్లుళా ఇచ్చిన పన్నస ఇరువది యాది నాల్కు మఱు స్తుర్లునేల - అని మూడో వాక్యం పరిసమాప్త మయ్యెను.

ఇచట 'కొట్టము' అనునది బోయకొట్టమువలె నొక దేశ విభాగమని చెప్పి ఆ విభాగములో భూమిని దానము చేసిరని దీనిని ప్రకటించినవారు చెప్పిరి. కాని 'కొట్టంబు' అనునది రాజనగరమని చెప్పి అందుండు ఒక పాఱకు (బ్రాహ్మణునికి) దాన మొసగిరి యనుట బాగుండును లేకున్నచో ప్రతిగ్రహీత యగు బ్రాహ్మణుని పేరు చెప్పలేదు సరిగదా ఆయన నివాస స్థలముకూడ చెప్పబడకపోవును. ప్రతిగ్రహీతల నివాస స్థానములు సాధారణంగా శాసనాల్లో చెప్పుట కలదు. అయితే యిచ్చిన భూమిగల దేశ విభాగము నిర్దేశింపబడ కుండుట లోపమగునుకదా యనినచో యీ శాసనశిల యున్న దేశమే అది యగునని సరిపెట్టుకోవచ్చును అట్లనేక శాసనాలు కలవు. బ్రాహ్మణుని నివాసమే కొట్టము. ఇరువది యాదినాల్కు - అనునది సంఖ్యావాచకము. ఇరువది (= రెండు పదులు) ఆది (= మొదటగల) నాల్కు (= నాల్గు) అనగా 20 ... 4 అని పూర్వము శాసనాల్లో ౨ం ముందువేసి కొంత వ్యవధి వదలి ౪ అంకెను వేయువారు. అట్లే మిగిలిన అంకెలను కూడ వ్రాయువారు. కనుక ఇరువది మొదటగల నాలుగు అని వ్రాయబడెను. దశ, శత, సహస్రాది స్థానములను బాగుగ వాడుట అప్పటి కింకా చేతకాదనిపిస్తుంది. పదుల స్థానములో సున్నను మాని ౨ మాత్రమేవేసి దగ్గరలో ౪ ను వ్రాయుట తెలిసిన తర్వాత ఇరువది నాలుగు అని 'ఆది'ని వదలి వ్రాయుట నేర్చిరి. ఈ విధంగా మూడు వాక్యాలతో శాసనం పూర్తి అయినది. రాజును, దానము చేసిన రాజోద్యోగిని చెప్పుట కొక వాక్యము, సాక్షులను చెప్పుట కొక వాక్యము, ప్రతి గృహీతను దానం చేసిన భూపరిమితిని చెప్పుట కొకవాక్యము. ఏ వాక్యములోను సమాపకక్రియ లేదు. మూడు వాక్యములలోను ఇచ్చిన పన్నస అని క్రియాజన్య విశేషణముతోనే కర్మ నిర్దేశింపబడినది అయినను పై జెప్పిన సందేహాలు ప్రతిగ్రహీత పేరు లేకుండుట, కొందరి సాక్షుల పేర్లు లేకుండుట, మున్నగు లోపములు కొన్ని శాసనంలో కలవు రచనలో తప్పులు లేవనవచ్చును

ఇవి క్రొత్తగా భాష నేర్చుకొనేవారి వాక్యములు. ప్రథమా విభక్తిలో ఏకవచన బహువచనములు. షష్ఠిలో 'పాఱకు' 'రాజుల్ల' అనునవి గలవు. సప్తమిలో 'కొట్టంబున' అని యున్నది ఇంతకు మించిన విభక్తి ప్రత్యయ ములు వాడబడలేదు. అంతే వాక్యరచనను మెఱుగుపెట్టుటకై కారక విశేషము లంతగా వాడుట యింకా బాగుగ తెలియదనిపించును.

కమలాపురం తాలూకాలోదే యిందుకూరులోని శాసనమొకటి రచనలో కొంత మెఱుగనిపించును.

"స్వస్తిశ్రీ చోటిమహారాజుల్లేళన్ ఎరిగల్ దుగరాజుల్ ఇచ్చిన పన్నస కొచ్చియపాఱ రేవశర్మ్మాఱరికిన్".

అని ఒకే వాక్యములో వక్తవ్యాంశమును పూర్తిచేసెను. అయితే దీంట్లో సాక్షులు లేరు. దాన మిచ్చిన భూపరిమితి లేదు. కాని

"తేనిఱచ్చిన వాన్డు పఞ్చమహాపాతక సంయుక్తున్డగు అసివైరువులిఖితం" అని యీ ధర్మమును చెఱిచిన వానికి పాపఫలము, వ్రాసిన వాని పేరు అసి వైరువు అని విడిగా రెండు వాక్యాలలో చెప్పబడెను. మొదటి వాక్యములో దాత, ప్రతిగ్రహీతల పేర్లు చెప్పబడినవి. బ్రాహ్మణుని గోత్రము కూడ 'కొచ్చియ' ( = కౌశిక)అని చెప్పబడింది. తెలుగులో వ్రాయాలనుకొనుటబట్టియే 'కౌశిక' అనుటకు బదులు 'కొచ్చియ' అను ప్రాకృత పదాన్ని రచయిత వాడెను. అనగా సంస్కృతములో వ్రాయుటకన్న తెలుగులో వ్రాయటం వారి కానాడు క్రొత్తగా ఉండేది. ఆ విధంగా భాషను సృష్టించుకొని వాక్య రచన చేయటంలో వారి నేర్పు కూడ చెప్పదగినదే.

ఇందు చెప్పబడిన చోట మహారాజు వెనుక కలమళ్ల శాసనమందు చెప్ప బడిన ధనంజయ మహారాజు యొక్క కొడుకని చెప్పుదురు. ఇతని తర్వాతి తరమువాడు పుణ్యకుమారుడు రేనాటి రాజులలో గొప్పవాడు. ఇతని కనేక బిరుదులు కలవు. తామ్రశాసనాలు కూడ ఇతనివి కలవు. ఇతని తిప్పలూరు శాసనము చూతము.



# 4. పుణ్యకుమారుని తిప్పలూరి శాసనము.

## (క్రీస్తు. 630. నాటిది కావచ్చును.)

—ఎపి. ఇండికా. XXVII-పుట 231.

ఇదియు కమలాపురంతాలూకాలోనిదే. దీని లిపి సొగసైన పల్లవ-గ్రంథాక్షరములను పోలి యుండును. ణకారము కళింగరాజుల శాసనములందువలె నుండును.

ఎరికల్ ముతురాజు పుణ్యకుమారుడు చివఱలి పట్టుగాను రేనాణ్డేలుచుండగా చామణకాలు అను ఉద్యోగికి టెవురు (నివాసియగు) తక్కన్ ప్రోలు పారదాయ (భారద్వాజః) కత్తిశర్మకు తివఱలూరను ఏబది (మత్తరుల) పన్నస కార్త్తిక మాసము బహుళపక్షము ద్వితీయ, పుణరు పువ్వుమి (పునర్వసు) నక్షత్రము సోమవారము బృహస్పతిహోర అగు సమయమున ధర్మము చేసెను. పుణ్యకుమారునికి మరున్త పిడుకు; మదముదితున్తు, ఉత్తమోత్తమున్తు, గణ్యమానున్తు అను బిరుదాలు లేక ప్రశంసాపదములు గలవు.

**మూలము**

1. స్వస్తిశ్రీ ఎరికల్లి ముతు
2. రాజు పుణ్యకుమారున్తు గణ్య
3. మానున్తు మరున్త పిడుకు మద
4. ముదితున్తుత్తమోత్తమున్తయిన వా
5. న్తు చివఱలియ పటుకాను రేనాణ్డే
6. ళుచు తక్కఱ పుఱోల పారదాయ
7. కిటెవురు కత్తిశమ్మఱకు తివఱలూ
8. ర పనాళ కొణ్డ కార్త్తిఱయ చీకు
9. బిదియ సోమవారంబు పుణరు

10. పుష్యంబు బృహస్పతి వారోర [శా]
11. ను పేమ్బది యె చామణకాల ధ [11*]

ఇచట దానము చేసినది చామణకాలు అను ఉద్యోగి. కనుక 'పుణ్యకుమారుడు రేనాణ్డేళుచు' -అనుదానికి పుణ్యకుమారుడు రేనాణ్డేళుచుండగా అని చెప్పవలెను. 'ళ' కారములు కొన్ని యింకా 'ల' కారములుగ మారలేదు. ఏళుచున్, అనేయున్నది. వేరేశాసనంలో 'ళమ్మఁళాకున్' అనికూడ కలదు. 'ఎరికల్' అనుహలంతము పట్టుదలగా 'ఎరికల్లు' అని అజంతంగా మార్చబడింది. ఇదే నిజమైన తెలుగుతనము. అట్లే ద్రవిడ హలంత తత్సమాలు పుణ్యకుమారన్; గణ్యమానన్, ముదముదితన్, ఉత్తమోత్తమన్ అనే పదాలు ఉకారాంత తెలుగు తత్సమాలుగ మారినవి. పుణ్యకుమారున్డు, గణ్యమానున్డు, మదముదితున్డు, ఉత్తమోత్తమున్డు అని ఉకారాంతములు ప్రథమైక వచన రూపములు తయారైనవి ఈ చివరి 'ఉ'కారము నుచ్చరించుటకు ముందున్న ప్రాతిపదికలోని 'అ' కారముకూడ 'ఉ' కారము కావలసి వచ్చింది. అనగా చివరి 'ఉ'కారము నుచ్చరించుటలో కష్టము లేకపోతే ముందున్న ప్రాతిపదికలోని తుది 'అ'కారము 'ఉ'గా మారనక్కర లేదనుకోవలెను. అందుచేతనే 'రంగడు' 'మల్లడు' 'రేవడు' అను రూపములనేకము వాడుకలోనున్నవి

ఇచట ముతురాజు అనుటచే పుణ్యకుమారుడింక మహారాజ పదవిని పొందలేదని తెలియుచున్నది. మఱున్ఱ పిడుకు అనగా శత్రురాజులకు పిడుగు వంటి వాడని అర్థము. 'క' 'గ' ఆమధ్య భేదమింక పూర్తిగా రాలేదు అట్లే 'త' 'ద' ల మధ్యకూడ. తేనికి, దేనికి అని అభేదంగానే వాడబడుచున్నవి. పల్లవ మొదటి మహేన్ద్రవర్మయొక్క 'పగాప్పిడుగు' అనే బిరుదును పోలిన బిరుదీ పుణ్యకుమారుని 'మఱున్ఱపిడుగు' లేక 'మార్పిడుగు' అనువవి. అట్లే 'మదముదితున్డు' అనేదికూడ పల్లవ రాజుయొక్క 'మత్తవిలాస' అనే బిరుదును పోలియున్నది. చిపఁలియ అనేది చిప్పలి అనే నగరము. పటుళాను (= పట్టుగాను) అంటే రాజధానిగా రాజ్యము చేయుచుండగా, అని అర్థము. తక్కఁపుఱోల అనగా తర్కప్రోలు అనేఊరు తకప్రోలు అని వేరే శాసనంలోకూడ వస్తుంది. 'పుఱోల' లోని 'ఱో' అను అక్షరము వలన ముందున్న 'పు' కొంత కాలమునకు 'ప్రో' గా మార్పునొందెను. అట్లే 'కొఱొంచె' అనునది 'క్రొంచ్చె' అని మారింది 'పారదాయ' అనగా 'భారద్వాజ' అని కత్తిశర్మయొక్క

గోత్రము కాదగును. ఇచట గమనించ వలసిన దేమన 'భారద్వాజ' అని, పుణ్యకుమారుని సంస్కృత శాసనాల్లో అనేక మార్లు వస్తుంది. అయినా యిక్కడ తెలుగుతనం ఉండాలని ప్రాకృత రూపాన్ని అనుకరించి 'పారదాయ' అని వ్రాసెను.

'కిఱెవురు' అనే పదానికి అర్థము తెలియుటలేదు. తిప్పలూరు లోనే భూమిదానం చేయబడింది. ఇట్లు బ్రాహ్మణులకు దానంగా ఇచ్చేభూమిని'పన్నస' అంటారు. పన్నాస, పన్నవిస అనురూపములలో కూడ నిది ప్రాచీన తెలుగు శాసనములందు కనుపించును.

'కొణ్డకాత్తిఁక' అను పదంలో 'కొణ్డ' అంటే సరిగా తెలియదు తిథి, వారాలు, నక్షత్రము, హోర చెప్పబడినవి పుణరుపువ్యం అంటే పునర్వసు నక్షత్రమని అర్థము. తమిళంలోకూడ దీనిని 'పునర్పూశం' అంటారు. సోమవార మనిన్నీ, బృహస్పతిహోర అనిన్నీ చెప్పబడినవి. శాసనాల్లో వారము, హోర చెప్పబడుట యిదే మొదలనిపిస్తుంది. కనీసం వారము పేరుచెప్పుట కూడ ఇంతకుముందు శాసనాల్లో కానరాదు.

ఏబది అని సంఖ్యమాత్రమే చెప్పబడింది సందర్భమునుబట్టి 'మఱుతర్లు' అను భూపరిమాణముగా గ్రహించవలెను. చామణకాలు అనే ఉద్యోగియొక్క 'ధ' అంటే 'ధర్మము' అని ప్రాకృతశాసనాల్లో సూక్ష్మముగా వ్రాయుట కలదు. కనుక అట్లే యిక్కడకూడ గ్రహించవచ్చును.

'రేనాణ్డేళుచుండగా' అనుటను బదులు 'రేనాణ్డేళుచు' అని వ్రాయటము, తుదిలో 'చామణకాల (ధర్మము)' అని క్రియ లేకుండా వాక్యం ముగియుట ఇవి రచనలోని లోపములు. వాక్యరచన సరిగా రూపొందలేదని స్పష్టంగా తెలుస్తోంది. వీరి శాసనాలన్నీ యించుమించుగా ఇట్లే యుండును. కొన్ని పదాలకి సరిగా అర్థం తెలియక పోవటమేగాక వాక్యాల్లో కర్త, క్రియ, కర్మలను తెలుపు పదాలుకూడ స్పష్టంగా ఉండవు. క్రొత్తగా భాషను తయారు చేసుకొనే కాలమది. ఈ మాత్రం శాసనం వ్రాయటమే చాలా గొప్ప అనాడు.

ఈ పుణ్యకుమారుని కొడుకు మొదటి విక్రమాదిత్యుడు, ఇతని కొడుకు శక్తికుమారుడు, ఇతనికొడుకు రెండవ విక్రమాదిత్యుడు, ఇతని కొడుకు సత్యా

దిత్యుడు. 'విక్రమాదిత్య' అను పేర్లు వచ్చినప్పటినుండి వీరు బాదామి చాళుక్యులకు సామంతులైనట్లు తెలుస్తుంది బాదామి చాళుక్య రెండవ పులకేశి వల్లభుని (611-643) కొడుకు మొదటి విక్రమాదిత్యుడు క్రీ. 678 వరకు రాజ్యమేలెను. తరువాత అతని కొడుకు వినయాదిత్యుడు, ఇతనికొడుకు విజయాదిత్యుడు వరుసగా రాజ్యమేలిరి. విజయాదిత్యుని కొడుకు రెండవ విక్రమాదిత్యుడు క్రీ. 732 లో రాజయ్యెను. ఇతనికి సమకాలికుడు సత్యాదిత్యుడనే రేనాటి చోళరాజు. ఈ రాజు యొక్క శిలాశాసన మొకటి కమలాపురము తాలూకా మాలెపాడులో కలదు.

# 5. సత్యాదిత్య చోళుని మాలెపాడు శాసనము.

(సుమారు క్రీ. శ. 725 నాటిది.)

ఎపి. ఇండికా. XI పుట. 345

మొదటివైపు 

1. అ స్వస్తి శ్రీ చోళమ

2. హా రాజాధిరాజ ప
3. రమేశ్వర విక్రమాది

4. త్య శక్తి కొమర వి
5. క్రమాదితుల కొడుకు

6. [శ్రీ] కాశ్యపగోత్రు
7. [న్దు*] శత్యదిన్దు శిద్ధి
8. [వే*]యు రేనాణ్టు ఏలు [వే]
9. [ళు] ఏళుచు [న్ది] కొమ
10. [టి] పాఱు రేవశ
11. మ్మాణ కాశ్యపగో
12. త్రి (త్రు)నికి ఇచ్చిన
13. [- -] చెఱుంబూరి ఉత్త
14. [- -] శ తూపుణన దిశ
15. [- -] దు జుగ్గి పొల గ [రు]
16. సు దక్షిణదిశ [ర]
17. [-] గ్గా పాలు [-]

రెండవవైపు

18 ఏనుమలుత్రుగా

19. ను తాగిరి [॥*] దేని
20. సల్పిన వానికి
21. వేగుర్లుమువేసె
22. ఉవుళు వేవాస్తు
23. ర్లు నిల్పిన పుణ్య
24. ంబు దీనికి వక్రంబు
25. వచ్చు వన్తు పుత్రవ
26. ద్య స్త్రీవద్య గోవ
27. ద్య పఞ్చమహా
28. పాతక క్జేసిన
29. వాని లోక[ంఋ]
30. న్వాన్తుఌ

ఇప్పటికి భాష కొంచెం మెఱుగైంది. రాజు కొద్దిపాటి ప్రశస్తి, తన కులగోత్రములు, తండ్రితాతల పేర్లు వ్రాయించుకొనెను తను చోళమహారాజాధిరాజ పరమేశ్వరుడననియు, విక్రమాదిత్యుని పుత్రుడగు శక్తికొమరుని కొడుకైన (రెండవ) విక్రమాదిత్యుని కొడుకుననియు కాశ్యపగోత్రమునకు చెందినవాడననియు చెప్పుకొనెను సిద్ధపటము - వేయి గ్రామాల సీమ, రేనాణ్డు- ఏడువేల గ్రామాల సీమ రెండిటిని కలిపి రాజ్యము చేయుచున్నట్లు చెప్పుకొనెను. అట్టి సత్యాదిత్య మహారాజు కాశ్యపగోత్రుడగు రేవశర్మ అను బ్రాహ్మణునికి ఇచ్చిన[ది] అని వాక్యము ముగియును. భూమి అని పూరించుకొనవలెను. కొమఱి అనునది 'పాఱ'కు విశేషణముగ నున్నది గనుక నొక గ్రామమని అర్థమగుచున్నది. తర్వాత వాక్యములో చిఱుంబూరు మున్నగు సీమలు చెప్పుతూ ఇచ్చిన భూపరిమితి చెప్పబడెను. వాక్యం చివర 'తాగిరి' అని సమాపకక్రియ కలదు ఆ సరిహద్దులు తాకునట్లు అయిదు మఱుతుర్ల భూమిని ఇచ్చిరి అని అర్థము ఇంతవఱకు రెండు వాక్యములు సరిగానే యున్నవి. 'తాగిరి' అను క్రియ మనకిప్పుడు ఈ యర్థములో కానరాదు.

తర్వాత ఈ ధర్మమును కాపాడువానికి పుణ్యఫలము, చెఱచువానికి పాపఫలము చెప్పబడినవి ఇందలి పదములు కొన్ని పరిశీలింపదగియున్నవి.

'విక్రమాదిత్య శక్తి కొమర విక్రమాదితుల కొడు'కను చోట మూడు పురుషాంతరముల వారొకే సమాసములో జేర్చి చెప్పబడుట యొక విశేషము. 'ఏఱుచున్ఱి' అని 'ఏలుచుణ్డి' అను నర్థమున వాడబడెను. కాశ్యపగోత్ర రేవ శర్మకు అనుటకు బదులు 'రేవశర్మ కాశ్యపగోత్రునికి' అనే ప్రయోగము విలక్షణంగా ఉన్నది. షష్ఠీప్రత్యయము 'రేవశర్మ' పదానికి కాకుండ గోత్ర పదానికి చేర్చబడింది. 21వ పంక్తినుండి వేగుడ్లు, ము వేసెఱువుళు, వేవాన్ఱు డ్లు సల్పిన పుణ్యము అను దానిలో ము యొక్క ప్రయోజనము తెలియదు. ప్రథమావిభక్తి ప్రత్యయము కాదు. ఆనాటికింకా 'ంబు' అనేదే వాడబడు చుండెను. లేఖక ప్రమాదము కావచ్చును. 'వేగుడ్లువు' అని దానిని ప్రకటించిన వారు చదివిరి. అప్పుడు కూడ 'వు'కి ప్రయోజనము కానరాదు. ఇచట 'గుడి'క బహువచనము 'గుడ్లు' అని యున్నది. అది నేడు గుడ్లు, గుళ్లు అని ద్వివిధరూపములైనది. అట్లే మఱికొన్ని పదములు గలవు. ఱవర్ణము భాషనుండి పోవునపుడు దానికి సరిపోవు ఉచ్చారణమును ఉన్న అక్షరములతో సరిపెట్టు టకై చేసిన ప్రయత్నమే యిట్టి వికల్పరూపము లయ్యెనని స్పష్టమగుచున్నది.

గుడి ⟶ గుడ్లు (=గుడ్లు, గుళ్లు) (ప్రస్తుత మాలెపాడు శాసనము)
వాకిలి ⟶ వాకిడ్లు (=వాకిండ్లు, వాకిళ్లు) అరకట వేముల శాసనము)
ఊరు ⟶ ఊడ్లు (=ఊండ్లు, ఊళ్ళు) (ఇదే శాసనము)
కంచరి ⟶ కంచడ్లు (కంచడ్లు, కంచర్లు) (అరకటవేముల శాసనము)

వేవాన్ఱు, డ్లు అని యీ శాసనమందు చూడనగును.

'వేవాన్ఱుడ్లు' అను పదము 'వేయి ఊళ్లు' అను నర్థమున వాడబడినట్లు తోచును. 'పుసలి పడువాన్ఱు' 'సాక్షి వచ్చువాన్ఱు' 'వక్రంబు వచ్చువాన్ఱు' మున్నగు క్రియాయుక్త విశేషములందువలె 'వేయి' అను సంఖ్యావాచకము తరువాత కూడ వాన్ఱు వాడబడెను. వేవాన్ఱు=వేయువాడు అని కీ. శే. మల్లం పల్లి సోమశేఖరశర్మగారు చెప్పిన యర్థమిచట బాగులేదనిపించును. పుత్రవధ,

స్త్రీవధ, గోవధ అనుటకు పుత్రవద్య, స్త్రీవద్య, గోవద్య అని యున్నది. పుత్ర వధయు, స్త్రీవధయు, గోవధయు అని సముచ్చయార్థక 'ఉ' ను చేర్చదలచ నేమో.

'లోకం జన్వాన్ఴు'=లోకము చనువాడు

ఊరు 'పదమును గురించి కీ. శే మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కొంత చర్చించిరి (రాజరాజ నరేంద్రసంచిక). అందు వారు 'ఊరు' యొక్క ప్రథమైక వచనము 'వాన్ఴు'లో వలె 'ఊన్ఴు' కాదగుననియు, అది క్రమముగ ఊణ్డు, ఊఁడు అయినందువలన ఊఁడ్లు, ప్రథమా బహువచనరూప మేర్పడి యుండుననిరి. కాని ప్రాచీనశాసనములగు కొనిసేవల్లి శాసనమందొక దానిలో 'ఊరు పెన్ కాలు' అనియు, చిలమకూరు శాసనమందు 'చిఱుంబురు పళన్' అనే ప్రయోగము ఉన్నది కనుక 'ఊరు' అని యేకవచనరూపము, అట్లాగే వారు చెప్పిన రీతిగ నల్లచెఱువుపల్లె శాసనములో 'కఙ్గూన్ఴు పళ' అనే ప్రయోగములో 'ఊన్ఴు' అను రూపము కనుపించుచున్నది. కనుక ప్రథమైక వచనరూపములోనే సందేహము కలుగుచున్నది 'ఴ' అను అక్షరముతో కూడిన పదమని చెప్ప వీలగు చున్నది. అది 'ఊన్ఴు' అనుటకంటె 'ఊఁదు' అనుట యుక్తమని తోచును. అది క్రమముగ 'ఊరు'గ మారియుండును. సాధురేఫమే ప్రాచీనకాలము నుండి యందు తఱచు కానవచ్చును. కాని వేల్పుచెర్ల శాసనములో 'కొొదవునూఱు' అని శకటరేఫ కలదు. కనుక అప్పటికే దీనిలోని 'ఴ' వర్ణము ర, ఱ, లుగ మార్పు నొందుచుండెనని తెలియుచున్నది. బహువచనములో మాత్రము 'ఊఁడ్లు' అను రూపము క్రమముగ ఊడ్లు, ఊళ్లు అని మార్పునొంది వికల్ప రూపము లేర్పడియుండును. ఏకవచనములో వారు చెప్పిన ఊణు, ఊఁడు అను రూపములు చిన్త్యము. 'వంగనూర్లి' అని వంగనూరికి సంబంధించిన లేక వంగ నూరులో అను ప్రయోగము అరకటవేముల శాసనమందు కలదు. 8, 9 శతాబ్దములలో తెలుగుభాషనుండి తొలగిపోయిన 'ఴ' అను మనకు తెలియని అక్షరము యొక్క వికారము లీ రూపములన్నియు. 'ఱ' అను వక్షరము కంటె ఈ 'ఴ' యొక్క వాడుక ప్రాచీనశాసనములందధికము. ప్రథమైక ప్రత్యయమునందేకాక, బహువచన ప్రత్యయమందు, ప్రాతిపదికలయందు ఇది ఉన్నట్లు తెలియుచున్నది. ఈ క్రిందివి కొన్ని యుదాహరణలు మాత్రమే.

పుణ్యకుమారున్ఴు — ప్ర. ఏ. ప్ర

| | | |
|---|---|---|
| ధనంజయుదు | — | ప్ర. ఏ. ప్ర |
| వాకిద్లు | — | ప్ర బ. ప్ర. |
| వాన్థు | — | ప్ర. ఏ ప్ర. |
| చదు | — | ప్రాతిపదిక |
| ఊదు | — | ,, |

ఈ వర్ణముయొక్క సరియగు ఉచ్చారణగాని, దాని విశేష ప్రయోగములుగాని తెలుసుకొనుటకు తగినన్ని పదములు ప్రస్తుతము లేవు. ఈ విలక్షణోచ్చారణము గల యక్షరమును ప్రాచీనులే తొలగించి దాని స్థానములో రూపాంతరముల నేర్పాటు చేసిరి. నన్నయగారికి కూడ దీని సంగతి తెలియక పోయియుండును

# 6. అరకటు వేముల శాసనము.

## (8 వ శతాబ్దముది కావచ్చును.)

ప్రొద్దుటూరు తాలూకా.

1. స్వస్తిశ్రీ వల్లభమహారాజాధి రాజపరమ మేశ్వర భట్టరళ పృథివిరాజ్య
2. శ్చేయన్ పెరాణ వంశ భుజంగది భూపాదిత్యుల కదాన్ వంగనూర్లి చరువ శమ్మణ పుత్ర
3. విన్నశమ్మణశాకు నిడుగడంబున పన్నళ ఇచ్చిరి. వేంగుళూద్లు, పెన్టొ కాలు, నారకొళు కంచద్దు
4. ఇన్నల్వురు సాతి.
5. దేనికి వక్రంబు వచ్చు వాన్డు పఞ్చమహాపాతక సంయ్యుక్తున్డగున్ ॥
6. అభ్ధిర్దత్తన్త్రిభి భుక్తం సద్భిశ్చపరిపాలితం। ఏతానినని వర్తన్తే పూర్వ్వరాజకృ
7. తానిచ॥ స్వదత్తా [0] పరదత్తా [0] వాయోహరేతి (త) వసున్దరా (0) షష్టిం వర్ష సహస్రాణి విష్టా
8. యాం జాయతే కృమి (ః) ॥

శాసనము చాలా స్పష్టముగ చదువుటకు వీలుగ నున్నది. శాసన పాఠము పూర్తిగనే యున్నది. చెప్పదగిన లోపములు కానరావు. సంస్కృత శ్లోకములలో తప్పులు చెప్పదగినవి అంతగా లేవు కనుక లేఖకుని దోషమని చెప్పి వదలివేయ వలసిన భాగమంతగా లేదు. కాని మనకి శాసనములో అనేక సందేహాలు కనుపించును.

1. 'పృథివీరాజ్యశ్చేయన్' అనే క్రియకు కర్త కనుపించదు. శ్రీ వల్లభ మహారాజు అని చెప్పుచో ముందుండవలసిన 'మహారాజాధిరాజ...' ఇత్యాది బిరుదు పరమందున్నట్లు భావించవలెను. అట్లాకూడ కొన్ని గలవు. "స్వస్తిశ్రీ విక్రమాదిత్య ప్రిథివీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర భటారళ్" అని

రామాపురం లోని చాళుక్య విక్రమాదిత్యుని శాసనము ఇదే కాలమునకు చెందిన దొకటి కలదు అయినను 'శ్రీ' ని స్వస్తిశ్రీలో దానినిగ చెపితే వల్లభ మహారాజగును శ్రీ వల్లభుడుగాని వల్లభుడుగాని ప్రసిద్ధ రాజెవడు ఆనాడు న్నట్లు తెలియదు

2. పెబాణవంశ భుజంగది భూపాదిత్యుల కదాన్—ఇది దానము చేసిన దాతను తెలుపును. భూపాదిత్యుడనే సామంతు డనుకొనవలెను. ఆయన మహాబాణ వంశమునకు చెందినవాడు. 'కదాన్' అనే పదానికి అర్థము తెలియదు. పెర్ అనగ కన్నడములో గొప్ప అని అర్థము.

3 'చరువశర్మ పుత్ర విన్నశర్మశాకు' అని ప్రతిగ్రహీత పేరు తండ్రి పేరుతో కలిపి సమాసము చెయబడింది నిడుగడంబున— అనేది స్థలనామము కావచ్చును. అచ్చట పన్నశ అంటే భూమి దానము ఇచ్చిరి.

4. సాతులు నల్వురు, ఉన్నపదాలు నాలుగు. (1) వేంగుళూర్ద్లు, (2) పెన్దొకాలు, (3) నారకోళు, (4) కంచ్పర్ద్లు ఈ నాలుగు మనుష్యుల పేర్లగునా కాదా అని సందేహము. వేంగుళూర్ద్లు అనునది ఊరిపేరగుచో పెన్దొకాలు ఆ యూరి వాడగును. ఇదియే ఉచితమని తోచును కాని 'వేంగుళూర్ద్ల' అని షష్ఠ్యంతముగా ఆదిలేదు. పైన 'వంగనూర్ద్ల' షష్ఠ్యంతము కలదు. 'నారకోళు' అనునది స్థలనామమో మనిషిపేరో తెలియదు. కాబట్టి మనయిష్టం మీద ఆధారపడి యున్నది. 'నమ్మిపోళు' అని మనిషిపేరొకటి బాణవంశపు ధవళెయ రాజుయొక్క బలవనూరు శాసనములో కలదు. అట్లే యిదియు మనిషి పేరగునేమో కంచర్ద్లు (కంచరివాండ్రు) అని యెందరో తెలియదు. ఈ నాల్గిటిలోను ఒక్కటికూడ మనిషిపేరుగా కనిపించదు. వేంగుళూర్ద్లు, వేల్పుచెర్ల శాసనమందున్న వ్యేంగులవంటి వారి సంఘమునకు చెందిన నివాసమని తోచును వారికి సంబంధించిన 'పెద్దకాలు' అనగ ఆసామి లేక ఉద్యోగి యని అర్థమగును. 'కణ్ణనూర్ద్లు' అని మనిషిపేరుగా వైదుంబ గండత్రిణేత్రుని వందాడి శాసనములో నున్నది అట్లే వేంగుళూర్ద్లు మనిషి పేరగునేమో చెప్పజాలము. ఇట్టి యూహా

లెన్నియైనను చేయుటకు వీలుగ నున్నది. సాతుల నిర్దేశము అంటే అక్కడ ఎదురుగ నున్నవారిని మనసులో పెట్టుకొని వారిపేర్లుకూడ వ్రాయకయే వీరు సాతులని చెప్పబడెను. కంచద్లు ఎందరో తెలియదు. మొత్తము నలుగురని మాత్రము చెప్పబడెను. ఇచ్చిన పన్నస యొక్క పరిమితిగాని యెల్లలుగాని చెప్పబడలేదు.

దీనినిబట్టి ఆనాటి మంచి భాషలో వ్రాయబడిన శాసనాలైనను మనకీనాడు సులభముగ నర్థముకావని చెప్పవలెను. దానికి ఆనాటి భాషసరిగా రూపొందక పోవుటయే కారణము. భాషను తయారుచేసుకొనే కాలమది. ఇప్పుడు మన కట్టికాలమొకటి తెలుగుభాషకుండెనా యనిపించును. ఉన్నదనుటకు ఈ అసంబద్ధ వాక్యములే ప్రమాణము. మాట్లాడునపుడు వారు ద్రావిడ, కన్నడ, ప్రాకృతములతో గూడిన తెలుగుభాషను మాట్లాడువారు. కన్నడులు తాము కన్నడములోనే వ్రాయటం మొదలిడినప్పటినుండి వీరికికూడ భాషాభిమానము పుట్టి వ్రాయుట ప్రారంభించిరి. ఆనాటి వారి శ్రమయే నేడు మనము తెలుగువారము అని చెప్పుకొనుటకు మూలము. తెలుగువారికి ఆరు-ఏడు శతాబ్దములలోని వారే మూలపురుషులు. నన్నయాదులకంటె మున్ముందు వారికే మనజాతి అర్పించవలసిన అగ్రతాంబూలము. గాసట-బీసటభాషనైనా మనకు వేర్పఱచి యిచ్చిరికదా! నేటి విశాలాంధ్ర నిర్మాణమునకు ఆనాటి వారి తెలుగు భాషా నిర్మాణమే మూలము.

# 7. వేల్పుచెర్ల శాసనము.

ఇది జమ్మలమడుగు తాలూకాలోనిది. శాసనము సమగ్రముగను స్పష్టముగను ఉన్నది. చివరి కొద్ది అక్షరములు తప్ప మిగిలిన భాగము బాగున్నది. కాని మనకు అర్థమగుటలో అనేక సందేహములు కలుగుచున్నవి.

**మూలము**

1. స్వస్తి శ్రీ కొల్లిబ్వేంగు
2 ళ కొడుకు అయితా
3. ణ్ణ అరిభాలబ్వేంగు
4. వేళ్పు చెఱువున
5. పా (జ) ళ్కి మి ప్రశాదె
6. ణ్ళేశె [॥*] వ రా స మిఖో
7. ళ శివ కొమరెయక్కు
8 చన్ద్రాదిత్య కాల్లంబు నాకు ని
9 ల్పిరి [॥*] సళనం బు (బి) చిరి [॥*] దీ
10. నికి శక్షి చేంగాలు ఎన్మశకా
11. లు ఏడ్లకాలు మేషికొణ్డు తాఱ
12. డ్లకలు [॥*] కొదపు నూఱ [వెట్టు]
13. రాజమానంబు నల్పది మఱు
14. తుడ్లు ఇచిరి [॥*] నేలనిల్పి
15. న వారికి అశ్వమేదంబున
16. వలంబు వక్రంబు వచ్చువాస్తు
17. వేగవిఱు వేగంగియఱు
18. భరనాసియులచిన

19 [వరు]

20. సిదయంబు రెణ్డు [దెళా]?

ఈ శాసనములో 'కాౙ్లి' లో 'ౙ' అక్షరమునకు తలకట్టు కలదు. చెఱువు, తాఱ్డకలు అను పదములలో శకటరేఫము కలదు. 'ఱ చినవరు'లో 'ఱ' అక్షరము కలదు

'అరిఘాల[వ్యేంగు' లోను 'ఖరనాసియు' లోను 'ఖ' వర్ణము కలదు. వేరే మహాప్రాణములు లేవు 'ఏడ్లకాలు' లో 'ఏ' అను అక్షరముపై దీర్ఘము కూడ కలిగియున్నది. ఎ, ఏ ల భేదము అప్పటి వ్రాతలో కనుపించదు. ఊాతిలోనేదైన వగులుండుటచే నట్లున్నదేమో.

దీనిలోని విషయమును ఈ క్రింది వాక్యములుగ విభజింపవచ్చును.

1. కాౙ్లిద్వ్యేంగుశకొడుకు అయితాణ్ణ అరిఘాల[వ్యేంగు వేళ్ప్వు చెఱువున పాఱిశ్కిమి ప్రశాదఖ్ఖ్పెసె ఇచట 'పా[ఱ]శిక్కిమి' అను పదము క్రొత్తది. 'పన్నస' కు వలె భూమిదానమని అర్థమిచట సరిపోవును. 'ఱ' అక్షరము స్పష్టముగ లేదు గనుక ఈ పదము సందేహముతో గూడి యున్నది.

2. వరాసమి భోశశివ కొమరెయకు చన్ద్రాదిత్య్య కాలంబునకు నిల్పిరి. ప్రతిగ్రహీత పేరు ఈ వాక్యములో చెప్పబడెను. 'వరాసమి' ఆయన ఊరిపేరగునేమో. 'భోశశివ' అనునది తండ్రి పేరు కావచ్చును. 'కొమరెయ' ఆయన పేరు.

3 సశనంబిచిరి – శాసనమిచ్చిరి.

4. దీనికి సాతులు : చేంగాలు, ఎమ్మశకాలు, ఏడ్లకాలు, మేమికొణ్డు, తాఱ్డకాలు అని ఐదుగురు.

5 కొదపునూఱవెట్టు రాజమానంబున నల్పది మఱుతుడ్లు ఇచ్చిరి. 'ఊరు' గ్రామమనే పదములో సాధురేఫమే కలదు కాని యిచట శకటరేఫ మున్నది. ఊఱు అనునది ఊరు, ఊఱు అని రెండు విధములుగను మారుటకు 'ౙ' యొక్క విలక్షణోచ్చారణమే కారణము. కొదపు

నూరులో కొలుచు రాజమానములో నల్వది మఱుతుర్ల భూమి యిచ్చిరని ఈ వాక్యమున కర్థము.

6 నేలనిల్పిన వారికి అశ్వమేధంబున ఫలంబు – ఫలశ్రుతి.

7. వక్రంబు వచువాన్ర వేగవిలఖు, వేగంగియలు భరనాసియు ఱచినవారు– అవి చెఱచువారికి పాపఫలము. భరనాసియు అనగా వారణాసియందు అని అర్థము. ప్రథమాంతమునకు 'ఉ' ప్రత్యయం చేర్చి యడాగమము చేయబడింది. కట్టించిన గుడియు, చేసినపనియు, ఇచ్చిన స్తితియు మున్నగు ప్రయోగములు ప్రథమైక వచనంలో శాసనాలలో వచ్చు చుండును.

8 సిద్ధాయంబు రెణ్డు [- -] – ఆ భూమిపై విధించు పన్ను. సాధారణ ముగ 'పన్నస' గ నిచ్చు భూములపై పన్ను విధించరు. కనుక 'పాఱక్కమి' అని మొదటి వాక్యములోని సందిగ్ధపద మేదో దాన భేదమను తెలుపునది గావచ్చును. దీనికి పన్ను కూడ విధించబడెను.

మొదటి వాక్యములో 'కాల్లిమ్ర్వేంగు కొడుకు అయితాణ్ణ అరిఖాల ర్వేంగు' అను దానిలో తండ్రి కొడుకు లిద్దరు పేర్కొనబడినట్లు తెలియు చున్నది. ర్వేంగు పదము ఇద్దరి పేర్లకు తుదియందున్నది గనుక దానిని వారి అధికారవాచక మనవచ్చును. గోకర్ణచోడుని కొడుకు ఉదయచోడుడు అను నపుడు చోడ శబ్దమువలె ర్వేంగు అనునది వారి వంశనామమైనను కావచ్చును. కాని ప్రసిద్ధవంశములలో నట్టి పేరు లేదు. కనుక 'రట్టడి' వలె 'ర్వేంగు' కూడ నొక గ్రామాధికారివంటి ఉద్యోగిగా గ్రహించిన బాగుండును. తండ్రి, కొడుకుల కా యధికారము వంశ క్రమమున సంక్రమించినది కావచ్చును. 'వేఁగు' అను పదము అరసున్న గలిగి తపించు అను అర్థమును కలిగియున్నది. అరసున్న లేని పదము చారుడు, దూత అను నర్థమును కలిగియున్నది. కాని పాఠికంగా దీనికి కూడ నరసున్న కలదని శబ్దరత్నాకరములో చెప్పబడినది. కనుక 'ర్వేంగు' అనగా 'దూత' అను నొక రాజకీయాధికారి. తలారివంటి ఉద్యోగి కావచ్చును. ఇప్పుడిక తండ్రిపేరు కాల్లిమ్ర్వేంగు అనియు, కొడుకు పేరు అయితాణ్ణ అరిఖాలర్వేంగు అనియు చెప్పవలెను. వీటిలో కొడుకు పేరు విలక్షణంగా కనుపించును. అయితాణ్ణ అనేది మాత్రమే పేరు కావచ్చును.

'అరి' పదమును 'శర్మారికి' ఇత్యాదులందువలె 'అర్య' శబ్దభవముగ గ్రహించి 'గారు' అని అర్థము చెప్పుకొని 'అయితణ్ణగారు అనే కాల లేక చిన్న వేంగు అని సర్దుబాటు చేయవలెను. 'అయితణ్ణారి' అని వ్రాయుటకు 'అయితాణ్ణ అరి' అని 'ణ'కు ఉండవలసిన దీర్ఘమును 'త'కు వ్రాసి 'అరి' అని విడిగా వ్రాసె నేమో. ఏదో విధంగా సరిపెట్టవలెను. లేకపోయిన కొడుకు పేరు విలక్షణంగా ఆనాటి పేర్లకు దూరంగా ఉంటుంది.

తండ్రిపేరు 'కాల్లిడ్రేంగు' అని చెప్పుటలో కూడ కొంత తప్పు ఉన్నదని తోచును. 'కాల్లి' అనేది మనిషి పేరగునా కాదా? 'డ్రేంగు' వలె అది కూడ నొక చిన్న అధికారిని తెలుపు పేరగునా? అట్టి అధికారుల అనగా 'కాల్లి' పై అధికారి 'డ్రేంగు' కాదగునా? అపుడు 'కొడుకు' అను పదానికి తండ్రిపేరు దొరకదు. పోనీ అధికారి కొడుకేననవచ్చు లేదా కొడుకు పేరులో 'అయితాణ్ణ' అనేది తండ్రి పేరే కావచ్చు కూడ. 'అరిపాల' అనేదే కొడుకు పేరు అగును. ఈ విధంగా కూడ చెప్పుట కవకాశము కలదు.

మనకు రేవణకాలు, పుద్దణకాలు వంటి పేర్లుగల అధికారులు కొందరు శాసనాల్లో అచ్చటచట కనిపించెదరు. అట్టి కాలులనే ఉద్యోగుల మీద దూత యైన వానిని 'కాల్లిడ్రేంగు' అని చెప్పవచ్చునుకదా! ఇట్లనుకొనుటలో కూడ కొంత అధార మీ శాసనంలోనే కలదు. నాలుగవ వాక్యంలో 'సాతు లుగ జెప్పబడిన వారందరు కాలురే. చేంగాలు (= చేలమీద అధికారి). 'చేను' శబ్దమున ఉత్వమునకు ఒకానొకచో లోపంబు గానంబడియెడి' అని చెప్పి శబ్ద రత్నాకరములో "వెలుగు చేన్మేసిన గాచు వార లెందు గలరె జగతి", ఉత్తర హరి. ౫ ఆ. ఉదహరించబడెను. చేను + కాలు = చేంగాలు అను రూపమగునని తోచును. ఎన్మశకాలు (= ఎనుముల మీద అధికారి), ఏడ్లకాలు (= ఏడ లనగా గొఱ్ఱెలు కనుక గొఱ్ఱెలమీద అధికారి); మేషికాణ్డు (= మేకలమీద అధికారులు); తాఅడ్లకాలు (దీని కర్థము తెలియదు) అంటే చేలమీద, బఱ్ఱెల మీద, గొఱ్ఱెలమీద, మేకలమీద, తాఅడ్లమీద పన్నులు వసూలుచేయు అధికారు లని అర్థము. ఈ కాలుర మీద పై యధికారి అనగా వీరు వసూలుచేసిన పన్నులను రాజుగారికిచ్చు వేగు 'కాల్లిడ్రేంగు' అనబడును. 'అరిపాల' అనే పదం పన్నులను వసూలుచేయునను నర్థమునే సూచించునేమో. కొండపర్తి శాసనంలో 'ఫలధారు' అనే సుంకరి యొకడు కనిపించును. 'అరిపాల'

'త్ర్యేంగు' 'కాలు' అనే పదాలన్నీ స్వల్పభేదముతో సుంకరులను తెలుపునని తోస్తుంది. ఆహవమల్ల, త్రైలోక్యమల్ల, త్రిభువనమల్ల అనే బిరుదులు ఈ షద్భేదముతో నొకే యర్థమును చెప్పుటలేదా. అట్లే

'కాల్లత్ర్యేంగు' అనే పెద్ద అధికారి కొడుకు అయితణ్ణ అనే అరిపాల త్ర్యేంగు అని చెప్పుకొన్నా తప్పులేదు. ఇప్పుడు 'కాలు' పదము యొక్క షష్ఠి కాల్ల అని కావలెను. కాళ్లు, కాణ్లు, కాద్లు అని ప్రథమా బహువచన రూపములగునేమో కాద్లు యొక్క షష్ఠి 'కాద్లి' అగును, అనగా కాలుర యొక్క అని చెప్పవలెను. ఊఱు (ఊరు) కి షష్ఠి 'ఊల్ల' అని 'వంగమూల్ల' అను పదములో పై జెప్పిన అరకట వేములశాసనమందు కలదు.

'కాలు' అను దానిని గూర్చి లోగడ అనేకులు చర్చించిరి. 'గురుపాదాః' 'పితృపాదాః' 'భగవత్పాదాః' ఇత్యాది సంస్కృత పదములందు గౌరవార్థముగా వాడబడు 'పాద' శబ్దమునకు తెలుగులో 'కాలు' అని చెప్పుకొని అదే గౌరవార్థము వాడబడియుండునని కొందరు తలంచిరి. కాని యీ శాసనంలో చేంగాలు, మేషికాలు, పడ్లకాలు, ఎన్మురకాలు అనునవి ఆ గౌరవార్థమును సూచించుటలేదు. మనుష్యవాచకములు గాక 'చేను' మున్నగువాటికి కూడ 'కాలు' వాడబడుచున్నది. ఇప్పటికి మహబూబునగర జిల్లా ప్రాంతములో 'కాలు' అంటే పశువు అనే అర్థంలో వాడుట నేను స్వయముగా వింటిని. కాలు అని వారు మాట్లాడుతుంటే దాని అర్థమును ఒకప్పుడు వారి నడిగితిని. వారు కాలు అనగా పశువు అని సమాధానము చెప్పిరి. అప్పుడు ఈ శాసనంలోని పదాలు కొంత అర్థమయినట్లు తోచినవి పశువేకాక వేరర్థములు కూడ ఈ శాసనమందు కలవు. అయినను 'పాదాః' అనే అర్థంకాదని నిశ్చయముగ చెప్పవచ్చును. ఆయా పశువులపైగాని చేలపైనగాని సుంకములు వసూలు చేయు ఉద్యోగి అని చెప్పుట చాల బాగుండునని తోచును. రేవణకాలు, వుద్దణకాలు మంచికాలు అనువారు కూడ అట్టి యుద్యోగులే యగుదురు

కాలురకు సంబంధించిన అధికారి గనుకనే అయితణ్ణ కొడుకగు అరిపాల త్ర్యేంగు తను చేసిన ధర్మమును కాపాడుటకై తనకు విధేయులగు కాలురను కొందఱిను సాతులుగ నియోగించెనని శాసనమున కర్థము చెప్పవచ్చును. అది యుక్తముగ కూడ నుండును. గుడులలో చేయు ధర్మములకు స్థానపతులను,

అచట యితర పనివాండ్రను సాతులుగను సంరతుకులుగను పెట్టునట్లే యిక్కడ కూడ తన వృత్తికి సంబంధించిన వారినే సాతులుగ పెట్టుకొనెను.

ఈ కాల్లివ్రేంగులు రేనాటి చోళుల సుంకాధికారులని తెలియదగును.

'వాకిలి' కి బహువచనము 'వాకిద్లు' (అరకటవేముల శాసనము)

అట్లే 'కాలు' కి బహువచనము 'కాద్లు' కావచ్చును.

ఞ అనే అక్షరము వాడుకనుండి పోవునపుడు 'వాకిఞ్లు–వాకిళ్లు' గా మారినట్లు 'కాఞ్లు–కాళ్లు' అను రూపములనొంది యుండవచ్చును. ఇట్టి వికల్ప రూపము లుండుట కట్టి 'ఞ' అక్షరమును తొలగించుటయే కారణము. దాని ఉచ్చారణముతో సన్నిహితోచ్చారణము గల రెండు మూడు రూపములు వికల్పముగ చెప్పుకొనవలసి వచ్చెను. 'కాలు' పదము పశువసెడు అర్థములో ఇంకను కొన్ని ప్రాంతములలో వాడుకయందున్నది. కనుక దీనిని నిఘంటువులో చేర్చుట మంచిది. ఈ విధముగ వాడుకలోనుండియు నిఘంటు కర్తల దృష్టికి రాని పదములను సేకరించుట నేటి పరిశోధకుల బాధ్యత. దానితోపాటు ప్రాంతీయముగ రూఢమైయున్న విశేషార్థములు గల పదములను, నుడికారములను సేకరించవలసిన అవసరము కూడ కలదు. ప్రాంతీయ పలుకుబడులను అనగా వాక్యోచ్చారణలోగల భేదములను నవీనపద్ధతిలో టేపురికార్డుచేయుట కూడ భాషా పరిశోధనకు అవసరము. ఇట్టి నవీన సాధనములు లేకున్నను శిలలపై వ్రాసియుంచిరి గనుక వాటిలో కొన్నియైనను మనకు లభించుటచే అప్పటి భాషను కొంతయైనను తెలిసికొనగలుగుచుంటిమి. తెలుగు పదము లనేకము సంస్కృతపదములతో భాషనుండి తొలగింపబడినవి. 'తొట్టు' అను పదము పశువను అర్థములో నిఘంటువులోను, శాసనములందును కనవచ్చును. తొట్టూరు అను గ్రామములు గూడ కలవు. అంటే పూర్వము పశువుల సంతలు జరుగు ప్రదేశములని అర్థము. కాని నేడు అది వాడుకలో లేదు. దాని స్థానములో పశువులు లేక గొడ్లు అనే వాడుచున్నాము. నేడు ఆంగ్లమునుండి, హిందీనుండి, ఉర్దూనుండి అనేక పదములు తెలుగుపదముల స్థానములో వచ్చి చేరుచున్నవి. ఈ దశలు జీవభాషలకు తప్పవని భాషా శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

అట్లే మఱికొన్ని పదములు కన్నడపదములని చెప్పి తెలుగునుండి

నన్నయాదులు తొలగించిరి. కాని శాసనాలలో నన్నయకు తర్వాత కూడ కనుపించును.

పన్నస = దానముచేయబడిన భూమి

ఇది కాకతీయుల నాటివఱకు శాసనములందు కానవచ్చును.

మఱ్తురు = భూపరిమితిని తెలుపు కొలత.

ఇది కాకతీయులకు తర్వాత కూడ శాసనములందున్నది.

ఇట్టివి ఉభయభాషలకు సామాన్యమనుకొనుటలో తప్పులేదు.



# 8. గణ్డత్రిణేత్ర వైదుంబ మహారాజు వన్నాడి శాసనము

## (రాయచోటి తాలూక.)

రేనాటి చోళుల తరువాత ఎనిమిదవ శతాబ్ది తుదియందు కడప మండలము బాణరాజులకును, వైదుంబ రాజులకును వశమయ్యెను. వైదుంబులు మొదట చిత్తూరు మండలములో నుండెడివారు. వారికి వైదుమ్బప్రోలు అను నగరము రాజధాని. తర్వాత రేనాటి చోళులను నిర్జించి చిర్పులి నాక్రమించుకొనిరి. కొంత కాలమునకు పొత్తపి (రాజంపేట తాలూక), కలుకడ (వాయల్పాడు తాలూక) నగరములు కూడ వీరికి రాజధానులయినట్లు శాసనము లందు కలదు. రేనాటి చోళులవలె వైదుంబులు కూడ తెలుగు మాట్లాడు రాజవంశమువారు. వీరి శాసనము లనేకము తెలుగులోను కొన్ని కన్నడములోను కలవు. వాటిలో అధిక భాగము యుద్ధములను గూర్చి పేర్కొనుచు అందు మృతినొందిన వీరుల స్మారకములుగ వేయించబడినవి. వీటినిబట్టి వీరు యుద్ధప్రియులగు రాజులని తెలియుచున్నది 9, 10 శతాబ్దుల లోని వీరి శాసనములు ప్రాచీన శాఖకు చెందినవి. 11, 12 శతాబ్దులవి అర్వాచీన శాఖకు చెందిన రాజులవని చరిత్రకారులు చెప్పుదురు. ఈ రాజుల చరిత్ర నిర్మాణమునకు తగిన శాసనసామగ్రి యింకా లభించక పోవుటచే వీరి ఉభయశాఖల చరిత్ర సరిగా తెలియదు.

ప్రాచీన వైదుంబులు బాణరాజులతో కలసి నోళంబ, గంగ, చోళ రాజులపై యుద్ధము లనేకము చేసిరి. అట్టి యుద్ధములలో సుమారు క్రి. 830 ప్రాంతములో జరిగిన సొరమేడి యుద్ధమతి ముఖ్యమైనది. ఈ సమరములలో ననేక వీరులు మరణించినట్లు శాసనములనుబట్టి తెలియుచున్నది, పెనుగొండ తాలూకాలోని చోళెమరి యనునది 'సొరమెడి' యగునని నిర్ణయించిరి. ముదిమడువను పేఱొక గ్రామమువద్ద కూడ యుద్ధము జరిగెను. వైదుంబ మహారాజు గణ్డత్రిణేత్రుడిందు పాల్గొనెను. ఈ క్రింది శాసనము అతని సేనాపతియు వైదుంబాన్వయమునకు చెందినట్టియు కలిగ త్రిణేత్రుడను రాజు రేనాంటి పొదస్థురవద్ద యుద్ధములో మృతినొందినట్లే క్రింది శాసనమున గలదు.

**మూలము**

1. స్వస్త్య అనేక సమర సంగట్టణో
2 వల్ధ (లబ్ధ) జయలతుమీ సమలింగిత
3. వక్షుస్త [ళ] కలిగె త్రిణేత్ర శ్రీసింగ
4. [మర] సేనాపతి వీరమహార (రా)జు స్వస్తిశ్రీమహా
5. ర(రా)జు రేనాణ్టి పొదన్దుర స్వగ్గణాం బెక్కిన కణ్ణ–
6 నూఱు అణివెట్టి కీఱుగుణ్ట నొ[చ్చి]
7. రి [।*] గణ్డ త్రిణేత్రున్దు కల్పి వుల్కువే
8. ళ్ళు పొసనంబు ఇచ్చె. ఎణ్భయి
9. వెట్టి పురి [పురాచ] వెట్టిర [।] కణ్ణ నూఱ్ల
10. గొలంబున వరికి వయ్యుంబ వసంబున వారు [దే] నికి
11. వక్రంబు వచ్చిన వాన్డు వారణాసి పాఱను కవిలళాను అచ్చిన
:3. వన్డు [।] గట్టు లి [ఖి*] తమ్ [॥]*

'అనేక సమర సంఘట్టనో పలబ్ధ జయలక్ష్మీ సమాలింగిత వక్షస్థల' అనునది వైదుంబరాజుల ప్రశస్తి. ఇచట చనిపోయినది వైదుంబాన్వయమున రాజపుత్రుడును, యువరాజును కావచ్చును. కనుక ఆ ప్రశస్తి యితనికి చెప్పబడెను. అతని పేరు కలిగె త్రిణేత్రుడు. సింగ [మర], సేనాపతి వీరమహారాజు అని అతని బిరుద నామములు. అతడు రేనాడులోని పొదన్దుర (స్థలము పేరు) వద్ద మరణించెను. రేనాటి రాజుల రాజధాని పొదిలి యనునది యొకటి కలదు ఆచట ఈతడు యుద్ధమున మరణించి యుండును లేక ఈ శాసనమున్న 'వన్దడి'. పొదన్ది దాని వికృతి యయినను కావచ్చును స్థల నామమని చెప్పుటయే యుక్తమని తోచుచున్నది. 'పొదన్దుర' అను పదములో 'ఊర అని తుది వర్ణములు పలుక వీలగుచున్నవి. 'రేనాంటి' అని ముందున్నది. కనుక రేనాంటిలోని 'పొదండి' యనుచోట అని చెప్పిన బాగుండునని తోచుచున్నది. అచట యుద్ధమున కలిగెత్రిణేత్ర సేనాపతి మరణించగా, అతనిని ఖననము లేక దహనము చేయునపుడు అతనితోబాటు కీఱుగుణ్ట నొచ్చినవాడు కణ్ణనూర్లు అనువాడు. రాజులుగాని, యువరాజులుగాని యితర ముఖ్యులుగాని చనిపోయి

నపుడు వారి దహనమప్పుడుగాని లేక ఖననమప్పుడుగాని మరియొక సజీవుని కూడ ఆ మృతదేహముతో కలిపి తుది సంస్కారము చేసెడివారు. సహగమనములో భార్యయే అట్లు భర్త యొక్క మృతదేహము ననుసరించి పోయెడిది. ఇచట అట్లుగాక రాజకళేబరముతో వేఱొకనిని బలవంతముగ బంపువారు. 'రాచపీనుగ తోడులేనిదే పోదు' అనెడి సామెతకు ఇదియే మూలము యుద్ధములందు చనిపోయిన రాజులకు మాత్రమే యిట్లు చేసెడివారో లేక సామాన్యముగ రాజులెట్లు చనిపోయినను చేసెడివారో తెలియదు. ఇప్పటికి మనకు తెలిసిన ఆధారములనుబట్టి యుద్ధమృతులగు రాజులకే యీ కీలుగుణ్ట సంస్కారము జరిగెడిదని తెలియుచున్నది. ఇట్టి శాసనములు మఱికొన్ని గలవు. ప్రస్తుతమున కణ్ణనూర్లు అను వ్యక్తి సజీవుడుగనే కలిగె త్రినేత్రుని మృతదేహముతో కలిపి కీలుగుంట (అనగా రెండు విధములగు శరీరములను కలిపి గుంటలో పాతిపెట్టబడు) సంస్కారమును పొందెను. ఈ సందర్భమున మృతుడగు రాజు యొక్క వస్త్రములు. అలంకారములు మున్నగునవి యీ సజీవ వ్యక్తికి తొడిగి ఆ వేషముతో నతనిని మృతదేహముపై గూర్చుండబెట్టి పూడ్చెడి వారు. అణివెట్టుట అనగా ఈ యర్థమే కావచ్చును. కిటెల్ - కన్నడ నిఘంటువులో అణి = to come near: to touch, etc. to put on Jewels and ornaments, to embellish అని యున్నది. మృతదేహమునకు అలంకారముండదు గనుక జీవదేహమున కదిచేసి తృప్తిపడుట దీని ఉద్దేశ్యమై యుండును.

ఇట్టి త్యాగము చేసినందులకు ప్రతిఫలముగ వాని సంతతి వారికి మాన్యము లిచ్చెడివారు. ఈ శాసనమట్టి మాన్యమును తెలుపుచున్నది రెండవ భాగమున రాజగు గణ్డత్రిణేత్రుడు కల్చి (కాల్చి) (దహనమే జరిగెననిపించుచున్నది.) పుల్కవేళ్ళు (= పుసుకతాలువు ?) అనగా యుద్ధములందు మారణ క్రియకు అధి దైవము. వీరమరణము బొందువారికి ఆ వేల్పువేర శాసనమిచ్చుట, ఆ వేల్పువేర పూజ సేయుట, మున్నగునవి కలవు. పుల్కవేల్పుని సేవించు ఆచారము తరువాత మైలార, బేతాళ దేవులను సేవించుట యైనది. ఇది వీరుల మారణ హోమమునకు సంబంధించిన తంతు. సొరమేడి యుద్ధమున చనిపోయిన వీరు లనేకులకు ఇట్టి సంస్కారములు చేయబడి యుండును. రెండు, మూడు శాసనము లట్టివి కనిపించుచున్నవి. ప్రస్తుతము ఎణ్బాయి (మర్తురులు), కీలుగుంట నొచ్చినవాని వారికిచ్చి పురిపు (= అర్థమగుటలేదు) రాచవెట్టిరి.

రాచమర్యాదలతో కాల్చిరి అని యర్థము. 'పురిపు' అనుచోట అక్షరములు సందిగ్ధముగ నున్నవి. 'చితి' యను అర్థము గల పదమగు ననిపించుచున్నది. తరువాత వాక్యములో, కీఱుగుంట సొచ్చిన కణ్ణమూర్తి వంశము వారికి వైదుంబ మహారాజులు వసంబున ఉందురు. అనగా కృతజ్ఞులుగా నుందురు. ఈ మాన్యమును చెడగొట్టువారు వారణాసిలో బ్రాహ్మణుని, గోవులను చంపినవారు. గట్టులితమ్ అని తుదిలో వ్రాసినవాని పేరేమో స్పష్టముగ లేదు.

ఇట్టిదే మఱియొక శాసనము అచటనే కలదు.

# 9. కొండపర్తి శాసనము.

వరంగల్లు సమీపములో కొండపర్తి యను గ్రామమువద్ద చెఱువులో నొక కొండరాతిపైన ఈ శాసనముకలదు. ఇది యిటీవలనే కనుగొనబడెను. అక్షరములు సుమారు తొమ్మిదవ శతాబ్దమునకు చెందునని భావింపబడుచున్నవి. అర్థమగుటలో నిదియు కొంత చిక్కు కలిగించుచున్నది ఇది యొక పొలమును కట్టుబడి కిచ్చు సందర్భమును తెలుపును.

1. స్వస్తి [।] పొలమెయరట్టోడి మంచి కాళు
2. కొణ్డపకు సమభగంబు తంబుల స్రవంబుచేసిన
3. భూమి [।*] దీని గూస్తుకుస్తుల వరుదివడ్డి యారంభచేయు వారు[।*]
4. యిట్లు దక్కనిగల్పమణ్డి తంబులంబు దిన్నవారవన్దామి గొరవలు [దా]నమెయు
5. కుమరమయ్యయు గణపతి యొాజు యిట్లు సాక్షిగాను తంబు[ల] స్రవంచేసిన స్రవణభూమి [।*]
6. యీ నెల యరి నాలుగు ద్రమ్మలు ఆయంబు పుట్టెణ్డుగొలుగు ధనం జెయ ఫలధారు
7. కొనువారు అకిడి వ[ం]గు లేదు [।*] యిద్దఱం బొత్తున నార [ం] భ చేయువారు అమ్మఙకొణ్డమణ్డి యారంభ
8. చేయువాణ్డు స్రావకుల భీమియక్త్రాం పొలదివాకరయస్రమ్మ గొలమేడియము సాక్షి[।*]
9. నాగ కమరియ క్రొచ్చె [॥*] మంగళమహాశ్రీ [॥*]

'క్త్రాంపొల' పదములో (8వ పంక్తి) 'ఱ' అక్షరము వాడబడెను. సున్నకు బదులింక బిందువులేగలవు. తంబుల స్రవంబుచేసినభూమి—ఉదకధారా పూర్వకముచేసి దానము లొసగుట మనకు తెలుసు. ఇది తాంబూలము పుచ్చు కొని యిచ్చిన భూమి. ఇది దానముకాదు. ఒక కట్టడి. అంటే భూమి సేద్యము

చేయుటకై యిచ్చి సమభాగం పాలు పంచుకొనే యేర్పాటుచేసుకొనిరి. పూర్వమిట్టి విధానము నిర్ణయముచేసుకొనునపుడు కూడ అందుకు సంబంధించిన వారు తాంబూల గ్రహణముచేసి తామా నిర్ణయమునకు కట్టుబడి యుందుమని అంగీకరించుట ఆచారమని మనం దీనివలన గ్రహించెదము. అట్టి అచారము వివాహ సందర్భములోనే మనకు ప్రస్తుతము అలవాటుగానున్నది. వధూవరులు నిర్ణయమై వారికి వివాహముచేయుదమని వారి పెద్దలు నిర్ణయము చేసుకొనునపుడిట్టి సంప్రదాయము కలదు. అట్లు తాంబూలము తినిన పిదప ఆ నిర్ణయము మారదని భావము. వివాహమునకు సంబంధించిన యితర నిర్ణయములు చేయునపుడుకూడ తాంబూలములు స్వీకరించుట కలదు. బజంత్రీలు, పలకీలు మోయువారు, వంటవారు మున్నగువారిచేతకూడ ఆనాడు తప్పక రావలెనను నిర్ణయముతో నిట్టి తాంబూల స్వీకారముచేయ బడును. వేరే కట్టుబాట్ల విషయంలో మనకంతగా ఈ యాచారము కనుపించదు. కాని ఆ కాలములో నిది ప్రతి ముఖ్యమగు కట్టుబాటుకి ఇరువురు-లేక పలువుర మధ్య పరస్పర ఒప్పందముమీద చేసుకొనబడు నిర్ణయానికి తాంబూల స్వీకరణము అతి ముఖ్యమగు సాంఘికాచారముగ నుండెడిదని మనకీ శాసనమువలన తెలియుచున్నది. అట్లు చేసుకొన్న నిర్ణయమును ఆయా పక్షముల వారెవ్వరు తప్పకూడదని కట్టడి. దానికి సాక్షులుకూడ తాంబూలము స్వీకరించెదరు. ఇది దానముకాదు. కేవల మొక కట్టడి మాత్రమే.

పొలమెయరట్టోడి అనే స్థానికాధికారి మంచికాళు కొడుకైన కొణ్డపకు చెరి సమానముగ పాలికి సేద్యముచేయునట్లు ఏర్పాటుచేసిన భూమి యిది అని మొదటి వాక్యానికి అర్థము. అట్లని తాంబూల స్వీకారముచేయబడెను. ఈ భూమిని కూమ్తుకున్తుల అంటే బిడ్డబిడ్డ తరమున పరువదివడ్డి అంటే వ్యవసాయ పర్వమునాడు చెల్లించుపన్ను చెల్లించి సేద్యము (ఏరువాక) ఆరంభచేయువారు అంటే ప్రారంభముచేయగలరు. భూమిలో సేద్యమునకు దిగువపుడు ముందుగ భూస్వామికి కొంత చెల్లించవలెను. పంట వచ్చిన తరువాత మఱికొంత చెల్లించవలెను.

పరువది = పర్వము = వ్యవసాయ పర్వదినమగు యేఱువాక పూర్ణిమవంటి దినము. నీరారంబంబు, కాడారంబంబు, (వరియారంబంబు, వెల్లారంబంబు అని కొరవిశాసనంలో పన్నులు విధించబడెను. అట్టి యారంభము ఇది)

వడ్డి
(ఒడ్డు→ఒడ్డి) = చెల్లించి
ఆరంభ చేయువారు = సేద్యము ఆరంభించవలయును.

కూన్తుకున్తు = స్త్రీవాచక పదములతో తరతరముల అనునర్థమున బిడ్డ బిడ్డ తరమువంటి ప్రయోగము కాని బిడ్డ పదము ఉభయ లింగ వాచకము (బిడ్డడు, ఆడబిడ్డ). కూన్తు పదము పుం వాచకము కాన రాదు.

ఇట్లుదక్కని = ఈ విధముగ దక్కు (=చెల్లును) అని

గల్పనుండి = స్థలనామము అచటనుండి ఈ శాసనములో 'నుండి' అను ప్రత్యయము రెండు చోట్ల వాడబడెను.

వన్దామిగొరవలు = వన్దామి యను పేరుగల గురువులు (మతస్థానమునకు చెందిన స్థానపతులు)

తంబులంబు దిన్న వార (రు)—తంబులము తిన్న వారు.

దానమెయు, కుమరమయ్యయు, గణపతి యోజు—దీనికి సాక్షులని చెప్పబడెను.

ఈ నేలయరి = ఈ భూమికిపన్ను—నాలుగు ద్రమ్మలు

ఆయంబు పుట్టెణ్డగొలుగు = ధాన్యరూపముగ చెల్లించవలసినది. పుట్టెడు కొలత.

ఈ రెండు విధముల రాబడి ధనంజెయుడను పేరుగల ఫలధారుడు (సుంకాధికారివంటి ఉద్యోగి) తీసికొనగలరు. ఈ పదము తహసీల్దారు. సుబేదారు, జమీన్దారువంటి ఉర్దూ పదముకాదు. ఈ సంస్కృతపదము వేఱుచో గానరాదు. క్రయవిక్రయములందు వస్తువుల వెలను నిర్ధరించుటయందు ధారణ పదప్రయోగము కానవచ్చుచున్నది. 'వణిజులు తమయంత వలసిన ధారణసేయ జూచుట ప్రజఁ జెఱచికొనుట' మడికిసింగన సకలనీతి సమ్మతము. ప్ర. 218.

అకిడి పంగులేదు — అకిడి, పంగులేదు. ఈ రెండు విధములగు వేఱొండు పన్నులులేవు. ఈ పన్నులెట్టివియో తెలియవు. పంగు సుంకము వేరే శాసనాలలో కూడవచ్చును. అకిడి

అనేది పంగునకు విశేషణమోలేక వేరే పన్నుమ తెలుపు పదమో తెలియదు. మొత్తముమీద రెంటి అర్థము సరిగా తెలియదు. పన్నులని మటుకు తెలుసు.

ఇద్దఱం బొత్తున నారభ చేయువారు—కొణ్డప—వన్దామిగొరవ. ఈ యిఱువుర పొత్తున

ఆరభ = సేద్యారంభముచేయువారు.

అర్మకొండనుండి యారభ చేయువారు—ఇది బహుళ గొరవల పక్షమున పంప బడు సేద్యకాండ్రను తెలుపును. ఈ గొరవలు అర్మకొండ (అన్మకొండ)లోని జైన గురువులు, వారు తమ సేద్య గానిని పంపుదురు. అనుమకొండకు పూర్వము అర్మకొండ యని యితర శాసనములందుకూడ కలదు.

స్రావకుల భీమయ — ఆ సేద్యకాని పేరు. ఆయన స్రావకుడు. సామాన్య జైన మతానుయాయి

ఈ సేద్యకానిని పంపు విషయములో క్షొంపాల దివాకరయ, స్రమ్న మేడియ అను నిద్దరు సాక్షులు.

నాగకమరియ — నాగయ్య అనే కమ్మరి యీ శాసనమును తొలిచెను. ఇచట 'నాగయ'లోని 'య' 'కమరి' పదమునకు చేరుట గమనించదగిన గ్రామ్య ప్రయోగము.

మంగళమహాశ్రీ — పూర్వకాలమునందేదివ్రాసినను 'మంగళాదీని, మంగళ మధ్యాని, మంగళాంతాని' అను సంప్రదాయమును పాటించెదువారు. మధ్య అదిలేకున్నను ఆద్యంతము లలో మాత్రము శాసనములందీ యాచారము కన పించును. ఆదిలో 'స్వస్తిశ్రీ' యనియు అంతమున 'మంగళమహాశ్రీ' అనియు ఉండును.

ఇప్పటి కౌలునామావంటిదీ శాసనము. స్టాంపులు, రిజిష్ట్రేషన్లు లేకుండ చక్కగ తాంబూలాలు పుచ్చుకొని నిర్ణయము చేసుకొన్నారు. దాన్నొక గుండు మీద చెక్కించారు.

# 10. కొరవి శాసనము.

## (సుమారు క్రీ. 935.)

పదవ శతాబ్దము లోగాగల తెలుగు శాసనాలలో ముఖ్యముగ చెప్ప దగినది కొరవి శాసనము. ఇది క్రీస్తు 935 నాటిదని చరిత్రకారుల యభి ప్రాయము. అప్పటి తెలుగు శాసనము లన్నిటిలోనిది భాషయందు, చారిత్రక విశేషములందు చాల ముఖ్యమైనది ఇది వరంగల్లుజిల్లా మానుకోట (యిప్పటి మహబూబాబాదు) తాలూకాలో కొరవి గ్రామమున వీరభద్రాలయములో నున్నది. శాసన స్తంభము తుదియందు విరిగిపోవుటచే నలువైపుల కొన్ని పంక్తులు నష్టమైనవి. ఇటీవల అదే గ్రామమున చెరువులో నొక శాసన ఖండము లభించెను. అదియు నిదేవిధముగ నుండ శిలా స్తంభముపై నిదేవిధమగు అక్షర ములలో దీని విషయముతో కలియు విషయమునే కలిగి శాసనము యొక్క అడుగు భాగము మాత్రము కలదిగా నుండెను. ముందుచెప్పిన మొదటిభాగ మున నష్టమైన భాగమిదియేనని నిశ్చయముగ చెప్పలేనంత అగోచరముగ విషయము కనుపించుచున్నది. మొత్తమున రెండు భాగములను కలిపి చదువు కొన్నను లోగడగల సందేహము లట్లే యుండును. దీని నిప్పటివరకు పలువురు విద్వాంసులు పరిశీలించి యుండిరి.[1] అయినను భాషయందైతేనేమి, చరిత్రయం దైతేనేమి యిందలి విషయములు సందేహరహితములు కాలేదు.

దీనివలననేగాని వేరువిధముగ తెలియని చరిత్రాంశము కొంత యిందు కలదు. శతాబ్దములు చెప్పబడకున్నను ఆధారాంతరములచే నిది క్రీస్తు 935 నాటిదని తెలియుచున్నది. పూర్వము వేంగీపాటికి పశ్చిమ సరిహద్దైన ప్రస్తుత ఖమ్మముమెట్టు జిల్లాకు చేరిన విషయమును ముదుగొండ చాళుక్యు లనబడు రాజులు దరిదాపు నాలుగు వందల సంవత్సరములు యేలుచువచ్చిరి (సుమారు క్రీస్తు 800 నుండి 1200 వరకు). వీరధికకాలము వేంగి చాళుక్యులకు సామంతులై యుండిరి. చాళుక్య గుణగవిజయాదిత్యుని తరువాత నతని సోదరుడగు విక్రమాదిత్యుని పెద్దకొడుకగు మొదటి భీముడు క్రీస్తు 892 లో

1. ఎ. పి. ఆంధ్రికా 1. పుటలు 118–145.

వేంగి రాజ్యమున కభిషిక్తుడగు సమయములో రాష్ట్రకూట రెండవ కృష్ణుడు దండెత్తి వచ్చి రాష్ట్రమును బీభత్స మొనర్చెను. అప్పుడు ముదుగొండ చాళుక్య వంశ్యుడగు కుసుమాయుధుడనే రాజు రాష్ట్రకూట కృష్ణునితో తన శక్తికొలది పోరి వేంగిదేశమును కాపాడి భీముని పట్టాభిషేకము నిర్విఘ్నముగ జరిపించెను. ఈ యంశముతో మన కొరవి శాసనం ప్రారంభమగును. మరల కొద్దికాలమునకే రాష్ట్రకూట కృష్ణుడు దండెత్తి వచ్చుచు త్రోవలో ముందుగ ముదుకొండ రాజ్యము నాహుతి గొనెను. ఆ యుద్ధములో కన్నర బల్లహుని (కృష్ణరాజు యొక్క) చేతజిక్కి ముదుకొండ చాళుక్య రాజయిన కుసుమాయుధుడు మడిసెను. ఈ వంశము నీప్రాంతమున నెలకొల్పినది బాదామి చాళుక్య సంతతిలోని వాడైన రణమర్దుడను రాజు. తాను పట్టము గట్టుకొనునపుడు రాజ్యాధికార సూచకముగ మెడయందొక కణ్ఠియను అలంకరించుకొనెను. దానికి రణమర్దకణ్ఠియ యనుపేరు. అతని సంతతిలో ఆ రాజ్యము నేలు రాజులెల్లరు దానిని రాజలాంఛనముగ ధరించుట ఆచారమై యుండెను. కుసుమాయుధుడు రణభూమిలో చనిపోగా మృతదేహము శత్రువుల వశము కాకుండు లోపుగనే శిరమును, దానితోపాటు అతడు ధరించిన రణమర్దకణ్ఠియను అతిధైర్య పరాక్రమములతో పోరి అతని పెద్దకొడుకగు గొణగయ్య కాపాడ గలిగెను లేనియెడల శత్రువులు తమచే జయింపబడిన ప్రధాన నాయకులగు రాజు సేనానాయకుల శిరములను తమ విజయసూచకముగ ఊరేగించి అవమాన పఱచెదరు. అంతేగాక వారి ముఖ్యములగు రాజలాంఛనములను తాము స్వీకరించి ఆ రాజ్యమును తాము లోబరచుకొన్నట్లు ప్రకటించుకొందురు. అందుచే రాజులు స్వయముగ యుద్ధములో పాల్గొనునపుడు తమ మృతదేహముల కిట్టి యవమానములు జరుగకుండ కాపాడుటకై తమ వెంటనే ప్రత్యేక రక్షకులమ ఉంచుకొందురు. ఈ సందర్భములో కుసుమాయుధునికి, అట్టి రక్షకుడుగ తన పెద్దకొడుకైన గొణగయ్యయే ఆయాపదలో శరీరమునుండి శిరమును, రాజలాంఛనమగు రణమర్దకంఠియను కాపాడెను. వెంటనే తానా కణ్ఠియను ధరించి రాజపదవిని స్వీకరించి అదే యుద్ధరంగమున శత్రువును పారద్రోలి విజయలక్ష్మిని సంపాదించి ముదుగొండ రాజ్యమును నిలబెట్ట గలిగెను. దీని కంతకు చాళుక్య భీముని రక్షించుట గూడ ప్రధానమైనది గనుక అతని సేనలు ప్రక్కనే సహాయముగ నిలబడినవని వేరే చెప్పనక్కర

లేదు. తనతండ్రి నిహతుడైనను గొణగయ్య రాష్ట్రకూట చక్రవర్తియగు కృష్ణ రాజును తరుమగొట్టి తన రాజ్యమును వేంగిరాజ్యమును కాపాడుట కొద్దిపాటి విషయముకాదు. చాళుక్య భీమునకు చేసిన ఈ మేలునకు ప్రతిఫలముగ వేంగి రాజ్యములో గొణగయ్య గౌరవ ప్రతిపత్తులు ఇనుమడించెను. కొరవి శాసన ములో మొదటి భాగమునగల చరిత్ర యిది

కొంతకాలము గడచినది. సుమారు ముప్పది సంవత్సరముల తర్వాత మొదటి భీముడు గతించెను. అతని పుత్రుడు కొల్లభిగణ్డ విజయాదిత్యుడు కొద్దికాల మేలెను. ఇతని పుత్రుడు మొదటి అమ్మరాజు వేంగికి రాజయ్యెను. అతడు కూడ ఆఱేడు సంవత్సరములు రాజ్యముచేసి గతించిన పిమ్మట దాయా దులలో కలహమువచ్చి వేంగిరాజ్యమును యుద్ధమల్లుని వంశ్యులగు తాడప, అతని కొడుకు రెండవ యుద్ధమల్లుడు చేజిక్కించుకొని యేడు సంవత్సరములు రాజ్యము చేసిరి. క్రీ. 934 లో మరల అమ్మరాజు వంశమునకు చెందినవారు తిరుగబడిరి. అమ్మరాజు సవతి తమ్ముడగు రెండవ భీముడు యుద్ధమల్లుని కడతేర్చి రాజ్యము చేజిక్కించుకొనెను. ఇట్టి అనిశ్చిత పరిస్థితిలో ముదుగొండ రాజగు గొణగయ్య కెవరిని చేబట్టి వేంగితో తనకుగల సంబంధమును నిలబెట్టు కోవలెనో తోచలేదు. రెండవ యుద్ధమల్లునికి రాష్ట్రకూట చక్రవర్తియగు నాలుగవ గోవిందుని అండదండలు గట్టిగా నున్నవి. కాని యుద్ధమల్లుడు రాజ్యార్హుడు కాదని గొణగయ్య భావించెను. మొదటి అమ్మరాజు కొడుకు బేత విజయాదిత్యుడు పిఠాపురము పారిపోయెను. అతని దృష్టిలో దేశము విడిచి పారిపోయిన అమ్మరాజు పుత్రుడగు ఈ విజయాదిత్యుడే న్యాయమైన రాజు. కాని బలహీనుడగుటచే రాజ్యమును దక్కించుకొనలేక పోయెను. యుద్ధమల్లుని కడతేర్చి రాజ్యమును సంపాదించిన రెండవ భీమునితో ముందుగా తన వ్యతిరేకతను చూపి విరోధము తెచ్చుకొనెను. యుద్ధమల్లుని సహాయము కొఱకు వచ్చిన రాష్ట్రకూట గోవిందుడు ముందుగా ముదుగొండ రాష్ట్రముపై బడెను. వేంగిలో తాను నమ్మిన బేతవిజయాదిత్యుడే పారిపోగా తనకు స్థానమేమాత్రము లేదని తలచి గోవిందునిధాటికి ఆగలేక గొణగయ్య పొరుగున ఉన్న వేములవాడ చాళుక్య రాజైన రెండవ అరికేసరియొద్ద శరణు జొచ్చెను. ఈలోగా అతని సోదరుడగు నిరవద్యుడు వేంగిలో రాజుగ నిలబడిన రెండవ భీముని ప్రాపుచేరి అతని బలముతో గోవిందునెదిర్చి తరిమివైచి ముదుగొండను

తాను చేజిక్కించుకొనెను. కొద్ది వ్యవధిలోనే వేములవాడ రాజైన రెండవ అరికేసరి గోవిందుని పరిమార్చి అతని ప్రత్యర్థియగు మూడవ అమోఘవర్షునికి రాష్ట్రకూట రాజ్యమిప్పించెను.

క్రీస్తు 933-934 సంవత్సరములో వేంగి, ముదుగొండ, రాష్ట్రకూట రాజ్యములలో నింత కల్లోలము జరిగెను. మూడురాజ్యములలోను రాజులు మారిరి. వేంగిలో యుద్ధమల్లుడుపోయి రెండవ భీముడు రాజయ్యెను. రాష్ట్రకూటమునకు గోవిందుడుహతుడై మూడవ అమోఘవర్షుడు (బద్దెగుడు) రాజయ్యెను. మధ్యనున్న ముదుగొండలో గొణగయ్య పారిపోయి వేములవాడ చేరగా అతనితమ్ముడగు నిరవద్యుడు వేంగిరాజగు ఇమ్మడిభీముని ప్రాపుతో అధికారమును పొంది యీ కొరవి శాసనమును వేయించెను. ఆ సందర్భమున కొరవిలో తన యధికారము ప్రతిష్ఠించుచు అచటి స్థానిక నాయకుడైన నల్ల మేడెయ కొడుకు పెద్దనను రావించి "నీవు నాకు చాల సహాయ మొనర్చితివి గనుక. దానికి ప్రతిఫలముగ నేదియైనను కోరుకొనుము ఇత్తును" అని యడిగినట్లు శాసనములో ఉన్నది దానికి జవాబుగ పెద్దన సవినయముగ "నీ సంపద యంతయు నాకున్నట్లే గనుక వేడుకొనవలసిన దేదియులే"దనెను. అంతేగాక "కొరవిసీమ ముదుగొండ సలుకులదే" అని చెప్పి విరమించెను. అంటే ఆవంశము వారెవరైనను తాను వారికి విధేయుడుగనే యుందునని స్థానిక నాయకునిచే వాగ్దానము చేయించుకొని అన్నయగు గొణగయ్య రాజ్యమందున్న కొరవికి తానే యధికారి ననిపించుకొనెను. అన్నగారిదివరలో కొరవి ప్రజలనుండి ఆనాయకున కిచ్చిన ఆదాయము లేవిగలవో అవి యన్నియు మరల తాను కూడ నిరవద్యుడు స్థిరపఱచెను. ఇది రెండవ భాగములోని చరిత్ర. ఇది చాల చిక్కులతో గూడి యున్నది. కనుకనే చరిత్ర పరిశోధకులకు గూడ సరిగా బోధ పడుటలేదు. రెండు పెద్ద రాజ్యములమధ్య జరిగిన పోరాటములో మధ్యనున్న చిన్న రాజ్యము పడిన యిక్కట్లు, ఆ సందర్భములో ఈ చిన్న రాజ్యమును దక్కించుకొనిన నిరవద్యుడు తన యధికారమును స్థాపించుకొనుటను తెలుపుటకై వేయించిన శాసనమిది. చాళుక్య మొదటి భీముని పట్టాభిషేక వృత్తాంతముతో ప్రారంభమై రెండవభీముని పట్టాభిషేకముతోనంతమగుచున్నది. అందువలన ఏ భీముడు శాసనములో చెప్పబడుచున్నది వ్యక్తముగాక పరిశోధకులు సందేహపడుచుండిరి. గొణగయ్య, అతని తమ్ముడు నిరవద్యులలో ఎవరి

కథ యెంతవఱకో తెలియక కొంత సందేహము. శాసన మసంపూర్తియగుటచే కొంత కష్టము. భాష విషయములో మొదటి రెండు భాగములలోను కష్టము కనిపించదు. మూడవ భాగమున దండనములు విధించు సందర్భములోనే కొన్ని పదము లర్థము కావు.

ఈ ముదుగొండ సల్కుల శాసనములు వేరే రెండు తామ్రపట్టికలు గలవు. కాని వాటిలో కేవలము వంశవృత్తములు మాత్ర మొసఁగబడినవి. రాజకీయాంశము లెవ్వియు తెలుపబడలేదు. ఇదియే ఆ రాజులకు సంబంధించిన క్లిష్టమగు రాజకీయములను తెలుపుచున్నది శాసనమును రచించుటలో జూపిన నేర్పును చెప్పదలచిన విషయములను సుబోధమగునట్లు వ్రాయజాలక పోయె ననిపించును. ఆనాడు వారి దృష్టిలో రాజకీయ విషయములన్ని పరిచితములై యుండినవే గనుక వారికి ఈ రచన చక్కగానే అర్థమగుచుండెడిదని భావించవలెను. మనమిప్పుడు ఆ రాజకీయములలోని విశేషాంశములను వేఱే ఆధారముల ద్వారా కనుగొనవలసి యుండుటచే కష్టముగానున్నది.

## శాసన మూలము

### పెద్దరాయి - మొదటివైపు

1. శ్రీ విక్రమాదిత్య నృపా
2. గ్రతనయుణ్డయ్న చాలుక్య
3. భీమునకు శౌచకన్దవ్వఱ
4. నకువే [ం] గీశ్వరునకు రన
5. మర్దఱ (ర్దాఱ) న్వయ కులతిలకు
6. ణ్డయ్న కుసుమాయుధుణ్డు గ
7. న్నర బల్లహుని కస్త్ర ప్రాప్త
8. [ం] బయ్న రనమర్దఱ (ర్దఱ) కణ్ఠియం దన
9. భుజవీర్య్య [ఱ] బల పరాక్ర
10. మంబున న్దెచ్చి కణ్ఠియం గట్టి
11. పట్టం బెత్తి ఖఙ్గ సహాయు
12. ణ్డై నేల యెల్లం గావంబు (బూ) ని

13. మంచి కొణ్డ నాణ్డా దిగ
14. వేంగి దేసము విష్ణువ
15. ర్ద్ధన (ర్ద్ధన)నుతో నర్ద్ధన రాజ్యంబు సే
16. యు చున్న కుసుమాయుధు పె
17. ద్ద కొడు కనేక రిపు నృపతి
18. మణిమకుట మకరికా
19 కమణ మృ శృ (సృ) ణిత చ [రణ*]

పెద్దరాయి - రెండవ వైపు

(ఈ క్రింది రెండు వై పులలో నేది రెండవదో ఏది మూడవదో చెప్ప వీలుగా కున్నది).

1. గల కలావ ర్త్తనంబు రా
2. జ్యంబు సేయుచు నిష్ఠ (ష్ట) వి
3. షయ కామ భోగంబుల
4. ను భవించు చు సుఖంబు
5. ణ్డి యొక్క నాణ్డు కొరవి నల్ల
6. మే తె య కొ డు కు పెద్దన
7. రావించి నీవు నాప్రాణ స
8. మానణ్డ వైన చెలివి నీ
9. చేసిన యుపకారంబు నా
10. కు బ్రత్యుప కారంబు సేయ
11. వలయుం గాన నీకేమి వ
12. లయుం దాని వే
13. ణ్డి కొమ్మన్న నీ
14. (శ్రీ) నాకెల్లం గలదేమిలే
15. కున్న వేణ్డి కొణ్డు మయ్న
16. ంబరోపకారంబు పొణ్దె నా
17. ని కొరవి యన్నది ముదు
18 గొణ్డ నల్కుల కులస న్త

## పెద్దరాయి - మూడవ వైపు

1. స[టూ] నెగల్ల (శ్రీ)నిరవ
2. ద్యుణ్డ నేక సమర సంఘు
3 ట్టణ భుజాసి ఖాసురు
4 డ్డై తమ యన్న రాజ్య (శ్రీ
5. కెల్ల న్దాన యరు వాుడ్డై
6. చేకొని నిల్చి శ్రీమసలు
7. కి యన్ద నేక వస్తు వా
8. హనోత్సవంబు ల్వడ యు
9. చు తమ యన్న గొణంగయ్య
10. చేసిన ధమ్మ్ర్కావులు నస
11. ంబును నెగల్పను గావను
12. రక్షింపను వలయునని
13. చేకొని కొరవి కిచ్చిన
14. స్తితి నల్పి శిలాస్థ (స్త) మ్భ
15. ంబు (ప్రతిష్టి (ష్ఠి) ంచి శ్రీమేళ్వ
16. రంబును నాతని కొట్పించి
17. న చెలువులు మఱియు మె
18. ల్వి యేని నాతని చా (చే) యంబడి
19. [న] ధమ్మ్ర్కావుల [న్ధి అ ...]

## మెదటి రాయి - నాలుగవ వైపు

1. ముక్కు దఱిగినను చఱి
2. చినను చురియ వెఱికిన
3. ను ముట్పి లినను అంకాడి
4. నను ఇరువాద్యది వను
5. (ద్రమ్మలు మాణిని చేసిన
6. దోసంబునకు వాని జీవిత
7. ం ఒ దణ్డువు వరియా ర [ం ఒ]

8. ం బు పడవరంబు, వెల్లార
9 ంబంబు ఎరగద్యాణంబు పె
10. రామణి పున్నమ నాణ్డు ప
11. నూరు ద్రమ్మలరివె
12. ట్టి సుఖంబు మనువ (వా) రు [।*]
13. నాయకుణ్డై య్యు (న) కాంపులయ్యు
14. వెఱ రాజులం జొచ్చి మ
15. నా [ం] జనదు యీ స్తితి యడి
16 సి కొన్న రాజుల్గ ల రేని
17. యు యీ స్తితి యడిసిన కవ
18. నావకు ఇన్దు మన్న కంపు

చిన్నరాయి - మొదటివైపు

1. ... బు న న్ద మ యమ్మక [ట్టి]
2. న వ ట్టం బు గావం బూని [ధు]
3. రదెఱె రాముణ్డై తనచే
4. తివాల తోడుగా నమంగు
5. గొణంగణ్డను వేరితో జ
6. లుక్య భీమణ్డు న్ద ను

చిన్నరాయి - రెండవవైపు

1. గాల [ం] బున ... ...
2. కా న్తరితుణ్డై చనిన నా
3. తని తమ్ముణ్డు సకలలో
4. కాశ్రయ, మణికణ (న) కము
5. క్రాలంకార చలుక్య కు [లో]
6. ద్భవ సితగ చటక్కా బీ

చిన్నరాయి - మూడవ వైపు

1. ఇచ్చిన స్తితియు ప టి య [ద]

2. యు [ం] బోయు వెరెయంబు జి
3. ట్టరి య్యెల్ల న్దక్కి చా బొడి
4. చిన మాట యిరువది ద్ర
5. మ్మలు మనం బొడిచిన
6. నఱువది ద్రమ్మలు
7. అక్కసలకు క ఱ కు [ం] లి
8. లేదు.

చిన్నరాయి - నాలుగవ వైపు

1. మహీపతి వంశ జాశ్చపా
2. పాదపేత మనసో భువి భూ
3. రిభూపా ఏ (యే) పాల యన్తిమ
4. మధమ్మర్ణ మిమం సమస్తం
5. తేషా [ం] మయా విరచి తోంజలి రేష
6. మూద్నిౝ (ర్ధ్నిౝ) [॥ *] చన్ది (సన్ది) విగ్రహి చాము (ం *)
7. ణయ్యవ (ప్రా) లు.

## కొరవి శాసనములోని భాషా విశేషములు

ఇది క్రీ. 935 నాటి దగుటచే ఇంచుమించు నన్నయభట్టు కాలమునకొక శతాబ్దము ముందుది. ఇప్పటికి పూర్వము తెలుగు శాసనములందు కనుపించు 'ಀ' అను అక్షరము పూర్తిగ అదృశ్యమైన దనవచ్చును. ఈ క్రింది పదములలో అది వాడబడలేదు.

| | పూర్వము శాసనము | ఇప్పుడు కొరవి శాసనములో |
|---|---|---|
| వీరున్దయ్య్ | (రాగిమడవనపల్లి) | తనయుణ్డయ్ను |
| ధనంజయుదు | (కలమల్ల) | కుసుమాయుధుణ్డు |
| వాన్డు | (రామేశ్వరం) | వాణ్డు |
| సంయుక్తున్దగున్ | (అరకటవేముల) | [లో] కాన్తరితుణ్డై |

'ఱ' అను అక్షరము వాడుకలోనున్నది.

ఖడ్గ అనుటకు ఖఙ్గ
మేడియ అనుటకు మేఱెయ
చళక్క అనుటచు చ ళిక్క (చాళుక్య)

| | | |
|---|---|---|
| నెగడ్పను | ,, | నెగఱ్పను |
| క్రొప్పించి | ,, | కొఱ్పించి |
| ముచ్చిలిన | ,, | ముఱ్చిలిన |
| చాముండెయ | ,, | చాముంఱెయ |

అక్రమ సంధులు :

1. చనదుయీాస్తితి యడిసిన — దీనిలో యీా
2. కలరేనియు యీా స్తితి యడిసిన ,, యీా
3. మఱియు మెవ్వియేనినాతని ,, మె అనునది వ్రాత పొరపాటు కావచ్చును. 'ఏని నాతని' యనుచోట 'ఏనిన్' ద్రుతాంతముగనున్నది. శబ్దరత్నాకరములో ఏని అని కళగాచూపి, ద్రుతాంతముకూడ మతాంతరమున జెప్పబడెను.
4. రాజుఙ్గలరేనియు ,, ఇచట కళగానే యున్నది.

సంధి వివక్ష చేయకుండ వ్రాసినవి :

1. కవనావకు ఇందుమన్న
2. అంకాడినను ఇరువాద్యది ఏనుద్రమ్ముల.

ఇంతవఱకుగల తెలుగు శాసనములలో 'ఐ' అను అక్షరము వాడుట అరుదు. దానికి బదులుగ 'అయి' అనునది వాడబడుచుండెడిది. కాని యీా శాసనమందు పదాంతములందు రెండు విధములుగను వాడబడెను. 'ఐన' అని 'న' పరముగ వ్రాయుచో 'అయిన' అని వ్రాయనుద్దేశించి 'అయ్న' అని వ్రాసెను.

తనయుణ్డయ్న, కులతిలకుణ్డయ్న, అస్త్రప్రాప్తంబయ్న, నాయకుణ్డైయ్న, అనుచోట రెండు విధముల కలిపి తప్పు వ్రాయబడింది 'న' పరముగాని, కేవల

'ఐ' అనియే వ్రాయుచోట 'అయి' వ్రాయకుండ ఏత్వము క్రిందైత్వము వ్రాసెను. ఖట్గసహాయుణ్డై, రాముణ్డై, [లో] కాన్తరితుణ్డై, భాసురుణ్డై, అరువాలుణ్డై, 'సమానుణ్డవైన చెలివి' అనుచోట మాత్రము 'ఐన' అని కలదు. (కడపజిల్లా అనిమెలలోని క్రీ. 976 నాటి వైదుంబ శాసనములో వర్షంబు 'ఐన' అని విడిగా 'ఐ' కారము కనిపించు చున్నది.) ఈ కొరవి శాసనములో విశేషమేమన 'అయిన' అను రూపములేదు. కాని 'అయ్న' అనేదే పైపదము లలో కనిపించు చున్నది. అనగా ఉచ్చారణ సౌకర్యము కొఱకు యి లోని ఇ లోపించినదని అర్థము. ఈ లోపము సంస్కృతంలోను కనుపించును. సంస్కృత ములో దీనిని ఉపధాలోపమని చెప్పుదురు. 'అథాప్యుపధాలోపో భవతి' అని నిరుక్తకారుడు వేదములో ఈ లోపమును జెప్పెను. 'అల్లోపో నః' అని పాణిని సూత్రముకూడ నిట్టి లోపమును గూర్చియే. (ఉదా: రాజన్ + ఇ = రాజ్ న్ + ఇ = రాజ్ఞి ; నామన్ + ఇ = నామ్‌న్ + ఇ = నామ్ని ; అనగా ఇచట వరుసగ 'జ' కారము 'మ' కారము మీది 'అ' కారములు లోపించినవి. నూతన ⟶ నూత్న ; విద్యాధర ⟶ విద్యాధ్ర ; ఇత్యాది సంస్కృత పదములు).

అట్లే 'వైదుంబ' పదము 'వయిదుంబ' అనికాని 'వయ్దుంబ' అనికాని అగును.

| | |
|---|---|
| గారికి ⟶ గార్కి<br>పెఱుకు ⟶ పెఱ్కు<br>ఇపుడు ⟶ ఇప్డు<br>చేసిన ⟶ చేశ్న<br>గాన ⟶ గ్నా | ఇట్టివి అనేక పదములు శాసనము లందు గానవచ్చును. మనకిపుడు వాడుకయందును గలవు. |
| చదువు ⟶ చదివిన<br>చేయు ⟶ చేసిన<br>అగు ⟶ అయిన | అనిక్త్రాంత క్రియా విశేషణములలో 'ఇన' తుదియందుండుట సామాన్యమై నను 'ఇ' లోపించుట గమనించ దగినది. |

సంయుక్తాక్షరములను ఉచ్చారణ సౌలభ్యము కొఱకు విశ్లేష మొనర్చుట కొన్ని తావులందు గానవచ్చును. తెలుగు శాసనములందిది సాధారణము. నిఘంటువులో కొన్ని చేర్చబడెను.

'అర్వొణ్డై' అనుటకుగాను 'అరువొణ్డై' వర్షంబు అనునది వరుషంబు అను రూపములో అనేక శాసనములలో నున్నది. కాని నిఘంటువులో చేరలేదు.

దీర్ఘమును హ్రస్వముగను, హ్రస్వమును దీర్ఘముగను వ్రాయుటకూడ కలదు

| | | |
|---|---|---|
| నీయుపకారంబు న కు | — | నీ యుపకారంబు నాకు |
| నా సం (సం) బు ... | — | న సంబు |
| మనువారు ... ... | — | మను వ రు |
| కాంపు ... ... | — | క ం పు |
| వ్రా లు ... ... | — | వ్ర లు |
| మనంజనదు ... ... | — | మనాంజనదు. |

వ్రాతలోని పొరపాట్లుగా చెప్ప దగినవి కొన్ని గలవు.

| | | |
|---|---|---|
| రణమర్ద అనుటకు | — | రనమర్ద (రెండు చోట్ల వాడెను) |
| విష్ణు వర్ధమతో | — | విష్ణువర్ధెనుతో |
| కలకాలవ ర్తంబు | — | కలకలావ ర్తంబు |
| వేణ్డికొన్దుము | — | వేణ్డికొణ్డుము |
| ప్రతిష్ఠించి | — | ప్రతిష్టించి |
| మఱియునెవ్వియేని | — | మఱియు మెవ్వియేని |
| మానిసి | — | మాణిసి |

గొణంగణ్డు - భీమణ్డు

ఇచట 'గొణంగ' 'భీమ' అనునవి ప్రాతిపదికలు. 'పుంలిఙ్గంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు'— (బాలవ్యా. తత్సమ - సూ. 21) అను సూత్రము ననుసరించి గొణంగుణ్డు, భీముణు అని రూపములు కావలెను, రాముణ్డు-వలె. 'మల్ల' శబ్దమునకు మల్లుండు, మల్లండు అని వైకల్పికముగా ఉత్వము గలదు. 'రంగ' శబ్దమునకు 'రంగండు' అని ఉత్వములేని రూపమే కాని 'రంగుండు' అని వ్యవహారమందు అంతగా కానరాదు కనుక పై సూత్రము వ్యవస్థిత విభాషయని తెలియుచున్నది.

ప్రత్యయమైన 'డుక్' లోని 'ఉ' కారోచ్చారణ సౌలభ్యముకొఱ కేర్పడినది గానే ప్రాతిపదికలోని 'అ' కారమును ఉత్వవిధియని తోచును. అంతే కొన్ని చోట్ల సారూప్యమును బట్టి పూర్వోచ్చారణ పరవర్ణము మీదికి కూడ జారును. ముకుట, రాముడు, భీముడు ఇత్యాదులలో వైరూప్యమును బట్టికూడ ఉచ్చారణ మారుట గలదు మకుట, పురిస, భీమణ్డు, గొణంగణ్డు ఇత్యాదులు. ఇట్టి మార్పులు భాషాశాస్త్రములోని తీరులని చెప్పెదరు. వ్యాకరణ సూత్రములు లేని నాటి ప్రయోగములగు భీమణ్డు, గొణంగణ్డు అను పదములు మన కిచట గలవు ఇట్టివియే మఱికొన్ని ప్రయోగము లానాటి శాసనములందు బహుళముగ గాన్పించును శకము 1042 (క్రీ. 1120) నాటిదగు మాచేడు శాసనములో నిట్టి పదము లనేకములు గలవు

1. కోట మల్లడింద్రాచల ధీరుండై
2. కీచక వైరి విక్రముండు కిల్బిష దూరుండు రామండును
3 మహేంద్రాచల ధీరుండప్పండు
4. భటాగ్రణి రేవండు
5. దాని దండి యీ నాచండు
6. మన్య దేవండనం గీర్తి మహిమన్
7. కీర్తులు దనరి వెలుంగ మల్లండన ధాత్రివీథులనెల్ల బరగె
8. గరిడియా బల మల్లండన

గూడురు శాసనములో వెన్నుండు, వెన్నడు, సూరడు అను ప్రయోగములు కలవు.

కనుక అర్వాచీనమగు బాలవ్యాకరణ సూత్రవిధి నిత్యముగాక వ్యవస్థిత విభాషగ వర్తించునని చెప్పవలెను.

అచ్చ తెలుగు పదప్రయోగములు చేయుటకూడ నిందు కానవచ్చును.

నేల యెల్లంగావంబూని— 'పృథ్వీరాజ్యం సేయుచు' అని ఆనాడు బహుళముగా వాడుకలో నున్నను తెలుగులోనే వ్రాసెను. శ్రీ విక్రమాదిత్య నృపాగ్రతనయుడని మొదట వాడినను తర్వాత కుసుమాదిత్యుని పెద్దకొడుకు అని తెలుగులో వ్రాసెను. చేతివాల తోడుగా— 'కరవాల' పదమును వాడక

మిశ్రసమాసమైనను దీనిని వాడెను. కలకాలవర్తంబు— ఆ చంద్రార్కర్క స్థాయిగానని వ్రాయలేదు.

**సంస్కృత దీర్ఘ సమాసములు :** రిపునృపతి మణిమకుట మకరికాకషణ మశృ (సృ)ణిత చరణ [యుగలుద్దై] సకలలోకాశ్రయ, మణికనక ముక్తాలంకార, చలుక్యకులోద్భవ, సితగచటిక్కభీ [మ–] అనేక సమర సంఘట్ట భుజాసి భాసురుణ్డు.

**విభక్తి ప్రత్యయములు :**

| | | |
|---|---|---|
| ప్రథమలో | — | డు, ము, వు, లు అన్నియు కనుపించును. వాణ్డు. దణ్డువు, దేశము, భోగంబులు, ధర్మువులు. |
| ద్వితీయలో | — | 'న్' మాత్రమే వాడబడెను. |
| తృతీయ | — | 'నన్' (పరాక్రమంబునన్), తోన్. |
| చతుర్థి | — | పొంటె (పరోపకారంబు పొంటె) |
| పంచమి | — | అన్దు (భీమసలుకి యన్దనేక వస్తువాహనోత్సవంబు ల్వడయుచు ) |
| షష్ఠి | — | కి, కు, ని. |
| సప్తమి | — | అన్దు (సలుకియన్దు) పంచమ్యర్థములో |

దీనినిబట్టి అన్ని విభక్తులలోను రచన చేయుచుండెడి వారని తెలియుచున్నది. రేనాటి చోళుల శాసనములకంటె కొంత మెఱుగేకదా!

ప్రథమా విభక్తి ప్రత్యయములో మరియొక విశేషము. 'ఇచ్చిన స్తితియు' అని 'స్తితి' అనే ఇకారాంత తత్సమముపై గూడ 'ఉ' చేర్చి యడాగమ సహితముగా వ్రాయబడింది. ఈ 'యు' సముచ్చ యార్థములో అనగా 'కూడ' అనే అర్థము నందుగాక 'ఉ' కార ప్రత్యయముతో నేర్పడిన ప్రథమాంత మేనని చెప్పవలెను. ఇట్టి రూపములు వేరే తావులందు 'చేసిన పనియు', 'కట్టించిన *గుడియు*', అని చెప్పు చిన్న శాసనములందు కూడ కనుపించును. తరువాత దానికి క్రమముగా లోపము వచ్చినది. దీనినిబట్టి ప్రథమావిభక్తి ప్రత్యయము 'ఉ' మాత్రమేనని తోచును. డ్, న్, మ్, అనునవి ఆగమ విశేషములు.

కావచ్చును గళ్. ల్ (ద్రవిడభాషనుండి) అనేది బహువచనంలోని ప్రత్యయమని నిశ్చయించిరి. ప్రాకృతమునందు 'అత ఓత్ సోః' అనే సూత్రమునుబట్టి ఆకారాన్త ప్రాతిపదికలకు 'ఓ' ప్రథమైకవచన ప్రత్యయముగా విధింపబడెను కాని యిది కూడ అ + ఉ = ఓ యేర్పడిన పిదప 'అ'కు లోపమును చెప్పుచు చేయబడిన విధి యనిపించును.

వత్స + ఓ అని 'ఓ' కారమును విధించి 'త్స'లోని 'అ' కారమునకు లోపము చెప్పుదురు. అప్పుడు వత్స్ + ఓ = 'వచ్ఛో' అను రూప మేర్పడును. కాని దీనికి 'ఓ' ప్రత్యయమునకు 'ఉ' మూలమనుట యుక్తమని తోచును. పై చెప్పినట్లు వత్స + ఉ = వచ్ఛో, వృషభ + ఉ = వసహో; పురుష + ఉ = పురిసో ఇత్యాదులు 'ఉ' ప్రత్యయముతోనే సిద్ధించుచున్నవిగదా! తెలుగుకి కూడ అట్లే 'ఉ' ప్రత్యయమే ముఖ్యమైనది. 'డ్, మ్, వ్, లు ఏకవచన మందును 'ల్' బహువచనమందును ఆగమములుగ వచ్చి చేరినవి.

గురువు, వధువు — ఇత్యాదులలో 'వ్' ఆగమము. అట్లే ప్రస్తుత ఇకారాన్త ప్రాతిపదికలకు 'య్' ఆగమము చేరగా, స్త్రీయు, వనియు, గుడియు అను రూపము లేర్పడును.

**కారకవిశేషములు :**

| | |
|---|---|
| అతని కొల్పించిన చెఱువులు :— | 'అతడు' అని ప్రథమాంతమునకు బదులు షష్ఠి వాడబడెను. 'నా యొనర్చబూనిన' వంటిది. |
| అతని చేయంబడిన ధర్మువులు నీచేసిన యుపకారంబునకు :— | 'అతనిచే చేయంబడిన' అనుటకు బదులు తృతీయకు లోపముగాని, లేక తృతీయార్థమున షష్ఠిగాని చెప్పబడెను. |
| భీమునలుకి యద్దవేక వస్తువాహానం బల్వడయుచు :— | ఇచట 'వలనవ్' అని పంచమికి బదులు 'అందు' అని సప్తమి వాడబడెను. |

**విశేషపదములు :**

1. ధురదెడె — 'తమయమ్మ గట్టిన పట్టంబు గావంబూని' ధురదెడె రాముణ్డై' అని ప్రయోగమున్నది. అర్థము తెలియదు.

2. సితగచళుక్య — 'చాలుక్యకులోద్భవ సితగచళుక్య' అని యున్నది చళుక్య = చళక = చాళుక్య : సితగ శీతగు - చల్లని కిరణములు గలవాడు (చంద్రుడు), ఇట్టి యర్థము చెప్పినను సరిపోవుటలేదు.

3 సటానెగల్ల — ఈ పదము నిరవద్యునికి విశేషణముగ జెప్పబడెను. బిరుదము.

4. నసంబు — నాశంబు

5 నెగఱ్పను — (నెగడు = వృద్ధినొందు) అభివృద్ధి గావించుట.

6. కొఱ్చించిన — క్రొప్పించిన = త్రవ్వించిన : వ్రచిన→వఱ్చిన→ వ్రచ్చిన (= చెఱచిన), అనురూపములవలె. క్రొచె→కొఱ్చె→ →క్రొచ్చె→(గ్రొచ్చు అని శబ్ద రత్నాకరము) 'ఱ' అను అక్షరము ముందున్న అక్షరములో క్రారముగను (◡) తరువాతి అక్షరములో దాని ద్విత్వముగను మారుట పలుతావులందు కాననగును.

7. ముఱ్చిలిన — ముచ్చిలిన—దొంగిలించిన.

8. పఱియ దయుం బోయు వెరెయంబు — అర్థమగుటలేదు. (వెరెయంబు = వ్రయము అగు నేమో)

9. బిట్టరి —

10. కళకూలి — అక్కసలకు కఱకూలిలేదు. ఈ పదము ఉప్పునూతుల శాసనమందు కూడ కలదు. అచట కఱుకూలి సర్వ బాధాపరిహారము చేయబడెను. వ్రడంగుల కిచ్చెడి కూలి మీద విధించు వృత్తి పన్ను మన్నించుట కావచ్చును.

11. (మాణిసి) మానిసి — భటుడు.

12. పడవరంబు — 'తోంటశాయు పడువారంబు ఇచ్చిరి' అని జయసింహ వల్లభుని విప్పఱ్ల శాసనమందు కలదు. (S I VI - 584) వరియారంబము కారుకు ధాన్యరూపమగు (Tax in kind) సిద్ధాయము

వెల్లారంబమునకు ఎర గద్యాణము (అరగద్యాణము?)
పన్ను—ఊరి మొత్తమున 500 ద్రమ్మలు అరి

(1) వడువారంబు —రైతులు విడిగా చెల్లించ వలసిన పన్నులు.

(2) ఎరగద్యాణము —

(3) 500 ద్రమ్మలు అరి —రాజుకు చెల్లించవలసిన ఉమ్మడి కానుక

13. వరియారంబింబు— వరివిత్తులు చల్లుకారు.

14. సెల్లారంబింబు— మెట్టగింజలు చల్లుకారు.

15. పేరామణిపున్నమ-ఆ మణి = వసంతము - వైశాఖ పున్నమి ?

16. కవవాప — ద్రోహి యనెడి నిందావాచకముగ వాడబడినది

17 ఇన్దుమన్న — కవనాపకు ఇన్దుమన్న కాంపు 'అని ప్రయోగము పై వాక్యమునుబట్టి ఈ స్థితిని లేక మర్యాదను (కట్టు బాటును) చెడగొట్టిన ద్రోహులకు' 'ఇత్తుము అన్న కాంపు ............' అని చెప్పవలెనేమో. కాని ఇమ్దు నివసించు కాంపు అని చెప్పుటయే బాగుండును.

18. చాబొడిచిన — చావన్ పొడిచిన = చావఁబొడిచిన (చావఁగొట్టిన), అని యుండవలెను. 'వ'కార లోపమిందు కానవచ్చు చున్నది.

19 కాంపు — 'గృహస్థుడు' 'రక్షకుడు' 'కాపాడువాడు' అను నర్థములు. ఈ పదమును ఊరికాంపు, పల్లెకాంపు, వసుల కాంపు, దివ్వెకాంపు, పొలంకాఁపు అను ప్రయోగములలో కనిపించును. వ్యవసాయదారు అను నర్థములో సామాన్యముగా వాడబడుచున్నది విజయనగర రాజుల శాసనములందు కూడ 'కాంపు' అని కలదు

ఈ శాసనములో ఈ స్తితి యడిసిన కవనాపకు ఇందుమంన్న కాంపు ............ అని వాక్యము నష్టమై అసంపూర్తిగ నున్నది. కనుక 'ఇందుమన్న' అను పదము పైన చెప్పినట్లు 'ఇచ్చెదము అన్నకాంపు' అనే అర్థము

చెప్పవలెనో లేక 'ఇందు (ఈ గ్రామమునందు) మనెడి (నివసించెడు, మనుట = నివసించుట) కాంపు ............ అని చెప్పవలెనో తెలియదు. ఇచ్ఛేదమును అర్థములో 'ఇన్దుము' అనుట సాధువుకాదు. కనుక రెండవ అర్థమునే గ్రహించవలయును. ఏనూరు ద్రమ్మలరివెట్టి సుఖంబు మనువారు అనే ప్రయోగమిందే కానవచ్చుచున్నది. అట్టే 'మనంజనదు'. 'నాయకులైన, కాంపులయ్న వెఱరాజులం జొచ్చి మనంజనదు' నిరవద్యుడీ వాక్యములో క్రొత్తగా తన యధికారమును స్థాపించుచు ప్రజలను శాసించుట తెలియుచున్నది ఇచట నాయకులైనను, కాపులైనను తననుగాక శత్రురాజుల పాలికి జనకూడదు. నాయకులనగా దండనాయకాది ఉద్యోగులుగాని, సంఘనాయకులుగాని కావచ్చును నాయక పదము క్రమముగా నాయుడు అని మార్పునొందెనని తెలియుచున్నది. సింగమ నాయకుడు - సింగమనాయుడు; అనపోతనాయకుడు - అనపోత నాయుడు; మాధవనాయకుడు - మాదానాయకుడు, మాదానేడు అనే మార్పులు పేర్లలో కనిపించును కాంపు లనగా నాయకులుగాక ఇతర ప్రజలని చెప్పవచ్చును.

20. ఎల్లన్ (= సమస్తము) అను నవ్యయము మూడుచోట్ల వాడబడెను.

తన యన్న శ్రీకెల్లన్దాన యరువాలైె.
నీ శ్రీనాకెల్లం గలద్ను.
జిట్టరి యెల్లన్దక్క.

**రచనా విశేషములు :**

**కొరవిసీమయందు నిరవద్యుడు సంపాదించుకొనిన యధికారము పెను గాలివంటి అప్పటి రాజకీయ వాతావరణములో తనకొక గొప్ప విజయమే.** అట్టి విజయమునకు తను ఆశ్రయించిన చాళుక్య రెండవ భీముడు యుద్ధమల్లుని జంపి వేంగిలో స్థిరపడుటయే కారణము. కనుక నిరవద్యుడు కొరవి యందు దీనినొక విజయ శాసనముగ స్థాపించెను. రెండవముక్క యిదేవిధమగు వేరొక శాసనఖండ మనిపించుచున్నది. అయినచో రెండు విజయ శాసనముల నతడిచట స్థాపించెననవలెను. రాజులు పూర్వము ఇట్టి విజయశాసనములను మిగిలిన **శాసనములకంటె ఘనముగా వ్రాయించుకొనుట ఆచారము. కనుక ఈ కొరవి**

శాసనము చక్కని భాషలోను, శైలిలోను రచింపబడి తెలుగు భాషలో నొక మలుపును సూచించును. అంటే అప్పటివరకు ఉన్న శాసనాలు చాలా తప్పుల తోను ఉచ్చారణ లోపములతోను ఉండెడివి. పైన జెప్పిన వేల్పుచెర్ల శాసనము చూడండి, చెప్పదలచిన విషయము నెంతకష్టముతో రచించెనో, ఎంత దుర్బోధకముగ నున్నదో, రెండుమూడు శతాబ్దులు గడిచిన తరువాత భాష యెట్టి యభివృద్ధి గాంచెనో యిందు కనపడును. అందలి రాజకీయాంశ ములు దుర్గ్రాహ్యముగ నుండుటయు, శాసనము కొంత శిథిలమగుటయు, ఆభాషలోని ప్రయోగములు కొన్ని మన కిప్పుడు పరిచితములుగాకుండుటయు, కారణమున మనకా రచన యింకను పూర్తిగా అర్థమగుటలేదు. అప్పటికి కన్నడములో కావ్యరచన ప్రారంభమైనది. పది సంవత్సరములలో పంపకవి, ప్రక్కనున్న వేములవాడలో, విక్రమార్జున విజయమనబడు కన్నడ భారతమును వెలువరింప నున్నాడు. తెలుగున పద్యరచన కూడ శాసనములందు కానవచ్చు చున్నది మన కొరవి శాసనము కూడ కవిత్వముతోనే మొదలగుచున్నదని చెప్పబడుచున్నది ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు ఈ క్రింది పంక్తులను ప్రస్తరించి చూపిరి,

(i) శ్రీవిక్రమాదిత్య - నృపాగ్ర తనయుడైన
చాళుక్య భీమునకు - శౌచ కందర్పునకు
వేగీశ్వరునకు - రణమర్దాన్వయ కులతిల
కుండైన కుసుమాయు - ధుండు గన్నరబల్ల
హుని కన్నప్రాప్తుండై - న రణమర్దకణ్డి
యందన భుజవీర్యబల - పరాక్రమమున దెచ్చి
కణ్డియంగట్టి పట్టంబెత్తి ఖడ్గ

ఈ యేడు పాదములందును ఐదేసి మాత్రలుగల నాలుగేసి గణము లున్నవి. కావున ద్విరదగతి రగడ పాదములుగా గనవచ్చును. మూడుపాద ములలో యతి సరిపోయినది. ఆద్యంత ప్రాసములులేవు.

(ii) కొరవి నల్లమేటెయ - కొడుకు పెద్దన్న (న)
రావించి నీవునా - ప్రాణ సమాను

ఇవి యతికూడ సరిపడిన ద్విపద పాదములు. ప్రాసలేదు,

(iii) శ్రీకెల్లఁ దాన యరుహుఁడై చేకొని
నిల్చి భీమసలుకి యందనేక

సీసపాదము యతిలేదు.

(ప్రాఙ్నన్నయ యుగము, పుట. 357)

వచన రచన కూడ చాల సొంపుగ నుండును.

(i) "పట్టంబెత్తి ఖడ్గ సహాయుండై నేలయెల్లం గావంబూని మంచి కొణ్డనాడ్డాదిగ
వేంగిదేశము విష్ణువర్ధనుతో నర్థరాజ్యంబ సేయుచున్న,
కుసుమాయుధు
పెద్దకొడుకనేక రిపునృపతి మణిమకుట మకరికా కషణ
మసృణిత చరణ".

(ii) తమ యమ్మకట్టిన పట్టంబు కావంబూని [ధరదేడి రాముడై
తనచేతి ఫాల తోడుగా "

(iii) "కళకాల వర్త్తంబు రాజ్యంబు సేయుచు
నిష్ట విషయ భోగంబు లనుభవించుచు
సుఖంబుణ్డి యొక్క నాణ్డు "

(iv) "నీ శ్రీవాకెల్లం గలదేమి లేకున్న వేణ్డికొన్ద
మయ్నుం బరోపకారంబు పొట్టనావి——————"

(v) తమయన్న రాజ్యశ్రీకెల్ల న్దాన యరుహుణ్డై చేకొని నిల్చి భీమ
వలుకి యన్దనేక వస్తువాహనోత్సవంబు ల్పడయుచు."

ఈవిధముగ శాసనమంతయు మృదుమధురముగ నన్నయభట్టు రచనా మాధుర్యము వందయేండ్లకు ముందే కలదని నిరూపించుచుండెను సంస్కృత పదములను సమాసములను తెలుగులో వలసినంతగా వాడుట యీ రచన యందలి విశేషము. తెలుగు శబ్దములు గూడ నట్లే వాడబడెను ఇందలి పద ప్రయోగములను బట్టియే నన్నయ ఆంధ్రశబ్దానుశాసన మొనర్చెనా యని పించును, 'ప్రయోగ శరణా వైయ్యాకరణాః' అని కదా పండితోక్తి. కాని

నన్నయ దీనిలోని ప్రయోగములనన్నింటిని స్వీకరింప లేదనియే చెప్పవలెను. తనవాటి కింకా వచ్చిన మార్పులను, తన సొంతమును, కన్నడ సంప్రదాయ మును కూడ దృష్టియం దుంచుకొని తను వ్యాకరణము రచించెను. క్రీస్తు 935 నాటికి తెలుగుభాష కావ్యరచనకు తగిన చక్కని రూపు దిద్దుకొన్న దనుటలో సందియము లేదు.

ఈవిధముగ కొరవిశాసనము తెలుగుదేశ చరిత్రలోను భాషలోను అనేక నూతన విషయములను మనకు తెలుపుచున్నది. కొరవిశాసనము 'కొఱవి' వలె అఱదు, వెలుగదు అని తీరని సమస్యగా పరిశోధకులు పరిహాసముగా చెప్పుదురు. చరిత్రలోను, భాషలోను దాని నింకను పరిశోధించవలసి యున్నదని భావము. ఇంతకు అది సాధురేఫతో గూడిన 'కొరవి'; శకటరేఫతో కూడిన కొఱవికాదు.

## అప్పటి కొన్ని సాంఘికాచారములు — ఆర్థికవిధానము

ఈ కొరవి శాసనములో చెప్పబడిన రాజకీయాంశములు, భాషావిశేష ములు ఎంత దురవగాహముగనున్నవో దానిలో చెప్పబడిన సాంఘిక విషయాలు కూడ నట్లేయున్నవి. అందు మొదటిది యుద్ధములందలి అలవాటుమగూర్చి పైన చెప్పితిమి. అంటే యుద్ధములో ప్రధాన నాయకుడుగాని, రాజుగాని చనిపోయినపుడు వారి పక్షము వారాతని శిరస్సును వెంటనే మృతదేహము నుండి కొనుకొనిపోదురు. లేనిచో శత్రువు లా శిరమును అవమానపఱచుచు ఊరేగించెదరు గొణగయ్య తన తండ్రియగు కుసుమాయుధుని శిరస్సును అతని మెడలోని వారి రాజలాంఛనమగు రణమర్దకణ్ఠియను అట్లు తెచ్చుకొనును. కొన్ని నేరముల సందర్భమున ప్రజలపై దణ్డనములు విధించబడినవి. వాటిలో మొదటిది పటియదయుంబోయు పెరెయంబు, టిట్టరి యెల్లన్దక్కి అనే భాగము అర్థమగుటలేదు.

(2) చావొడిచిన నూటయరువది ద్రమ్మలు — హత్యచేసిన నేరమునకు 120 ద్రమ్మలు దణ్డువు

(3) మనం బొడిచిన నఱువదిద్రమ్మలు — ప్రాణము తీయకుండ హత్య ప్రయత్నముచేసిన వారికి 60 ద్రమ్మలు దణ్డువు.

(4) అక్కసలకు కఅకూలిలేదు—ఇచట సందర్భము తెలియను కాని అగసాలురకు కఅకూలి(?)లేదు. వారికివ్వవలసిన మామూలు వృత్తిసుంకము లేదని యర్థమేమో.

(5) ముక్కుదఱిగినను—ముక్కుకోయుట, ఆనాటి దుర్మార్గములలోనిది యొకటి కావచ్చును.

(6) చఱిచినను — చేతితోకొట్టుట

(7) చురియవెఱికినను — కత్తిచూపించి పొడవ ప్రయత్నించుట (కత్తితో పొడిచినను)

(8) ముచ్చిలినను— దొంగిలించుట

(9) అంకాడినను—వ్యభిచరించుట

వీటి కన్నిటికి 25 ద్రమ్మలు అపరాధము చెల్లించవలెను ముక్కుదఱిగి నను 25 ద్రమ్మలతో నేరము పోతుంగట ఇప్పటి న్యాయస్థానములలో విధించే శిక్షలుకూడ సరిగా యోచిస్తే యింతే.

(10) మాణిసిచేసిన దోసంబునకు వాని జీవితంబదండువు—మానిసి (రాజు సేవకుడు) పై జెప్పిన నేరములు చేసినచో వాని జీవితము (=జీతము) ఇవ్వబడదు.

(11) వరియారంబంబు వడువరంబు—వరివిత్తుకారుకి అంటే వరిపంటల దినములలో వడువారంబు అంటే ధ్యాన్యరూపమున నిర్ణీతరాజభాగము చెల్లించ వలెనని యర్థము కావచ్చును.

(12) వెల్లారంబంబు ఎరగద్యాణంబు :—మెట్టపైర్లకారుకి గద్యాణ రూపములోపన్ను చెల్లించవలెను. 'ఎర' అనేది గద్యాణమునకు విశేషణము గోకర్ణగద్యాణము, సింగవగద్యాణము, ఇంకా అట్టి ఆయా రాజులుగాని, ఇతర నాయకులుగాని తమతమ పేర్లతో నాణెములు ముద్రించెడివారు. ఈ 'ఎరగద్యాణ' మిచటి ప్రాంతీయ నాణెమని భావించవలెను. లేక అరగద్యాణ మనెడి యర్థమున ఎరగద్యాణమని వాడెనేమో తెలియదు.

(13) పెరామణి వున్నమనాణ్డు ఏనూరు ద్రమ్మలరివెట్టి సుఖంబు మను వారు—ఇది వార్షికపన్ను. గ్రామము మొత్తమున రాజుకి చెల్లించవలసిన 'అరి' అనగా నొక విధమగు సామూహిక కప్పము ఇది నల్ల మేడెయ కొడుకు పెద్దన నిరవద్యునికి చెల్లించవలసినది

(14) ఈ నిబంధనకు కట్టుబడి శత్రురాజులపాలికి పోకుండ నిచట సవ సించవలయును. లేనిచో ఈ గ్రామము విడచిపోవలెను—అనినిరవద్యుడు కొరవి కిచ్చిన స్థితియు, పై వాటిలో కొన్ని పదముల కర్ధము తెలియకున్నను ఆనాటి ప్రజలు చెల్లించెడి పన్నులు, తద్ద్వారా రాజుకి చెల్లే ఆదాయము తెలుస్తుంది

# 11. కొన్ని పద్య శాసనాలు.

ఏ భాషయందైనను క్రమమగు విధానములో వాక్యరచన యేర్పడక పూర్వమే గ్రామ్యవేడుకలకు చెందిన పదాలు, పాటలు, మొదలగు వాఙ్మయము వెలువడి ఆయా ప్రజల్లో ప్రాంతీయంగాను అనుశ్రుతంగాను వచ్చుచుండును. కాలక్రమంలో కొన్నిపోయి మరికొన్ని క్రొత్తవి చేరుచుండును ఇట్టివి యెచట వ్రాయబడి యుండవు గనుక మనకు తేనట్లే. వ్రాత చేతనైన తరువాతకూడ అట్టివి వ్రాసియుంచవలెననే తలంపు కలుగకపోవుటవలన అనేక పదాలు, పాటలు ప్రజల నోళ్ళలో ఉన్నంతకాలం ఉండి తర్వాత అంతరించును. గాథా సప్తశతివంటి ప్రాకృత ముక్తకములట్టివే తెలుగులోకూడ నట్టి క్రమబద్ధమైన పద్య రచనలున్నట్లు శాసనాల్లో అక్కడక్కడ గనబడును ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు వారి 'ప్రాఙ్నన్నయ యుగము' అను గ్రంథములో కొన్ని శాసనములనుండి అట్టి పద్యములవలె కనుపించు భాగములు 'వృత్తగంధి' లేక 'పద్యగంధి' యనబడునని తెలిపి యీ క్రింది యుదాహరణములిచ్చి యుండిరి. (ప్రాఙ్నన్నయ యుగము. పుట 354.)

1. "పుణ్యకుమారుండు గణ్యమానుండు"——(తిప్పలూరి శాసనము)

ఇది ద్విపద పాదము; ప్రాసయతివేయబడినది.

2. "విరివటితి కమ్మరి వినియనవ్రాసె"——(రామేశ్వర శాసనము)

(ద్విపదపాదము; యతిపరిగానున్నది.

3. (i) "శ్రీమహేన్ద్రున్ మాన రవి మాలురాపిడుగు"——

(బూడిదగడ్డపల్లి)

ఇందు పంచమాత్రాత్మకమైన నాలుగు గణములున్నవి.

ద్విరదగతి, రగడపాదము, యతిలేదు.

(ii) "మగడ, పుదలి, మేలు, వాండు కాపి, బోళ, ముత్త, రాజు"

ఇందునాలుగేసి సూర్య గణములతో గూడివ (త్రిమాత్రా గణములతోగూడిన) రెండు దళములున్నవి. యతిలేదు

తురగ వల్గన రగడ పాదమగును.

(iii) "అచ్చెర్వు గనునరి వరజముండన్వాడు
దంతియమంగుతోడ(న్) బొడిచిపడియె(న్)"

కొంచెము మార్పుతోనిది సీసపద్య పాదమువలెనున్నది యతులులేవు.

4. i "ప్రభుచోటి రట్టోడి - పరహితుడితడు"

ఇది ద్విపదపాదము

ii "కట్టెంచె కనికపొం-పట్టంబు హణులుగు" ———(కొనినేవల్లి)
ఇది సీసపాద పూర్వార్ధము SII-X-598

5. "దేవస్వంబు లంచము గొన్న వాడు వార
ణాసి వ్రచ్చిన పావంబు గొన్నవాడు" (పెద్దముడియం)
(SII-X, 611.)

వీటియందు యతిలేదు; కాని యివి రెండును
తేట గీతి పాదములనుటకుఁదగియున్నవి.
దేవస్వంబు అన్నప్పుడు 'స్వ'నూది వలుకక తేల్చివలుకవలెను.

5 ఏనియుఁలో గొన్నవాడు నిచ్చినవాడు
చెడువాడు క్టొచ్చినవాడు వెంట——— (SII-X-6120.)
యతులులేని సీసపాదము

7. వెంక యచోటి మహారాజు తెంకణా
దిత్యుండు కొమరు రభీముండు పుని
ఇల్ల దాటిమ్మనీ ధర్మ మా చంద్రార్క
తారకంబును వార్ధిలుచునుండు దొంగలసాని శాసనము
EI-XXXII

ఇందు గణములు కొంతవఱకు సరిపోవుచున్నవి. మొదటి పాదమునందలి చంద్రగణమున నొక మాత్ర హెచ్చుగను, రెండవ పాదమునందలి చంద్రగణమున నొక మాత్ర తక్కువగను గనఁబడుచున్నవి. మహాక్కర కాదగునని సూచించిరి.

8. కొరవి శాసనమందలి మొదటి వాక్యములో నేడు పాదములుగల భాగము నెత్తి ద్విరదగతి రగడ పాదములగునని చెప్పిరి.

# 12. పణ్డరంగుని అద్దంకి శాసనము

## (శ. సం. 770 ప్రాంతము.)

మొట్టమొదట తెలుగులో గణయుక్తముగ వ్రాయబడిన పద్యము అద్దంకి శాసనమని కీర్తిశేషులు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు గుర్తించి ప్రకటించి యుండిరి (ఇపి ఇండి. IX. పుటలు 271-275). ఇది తూర్పు చాళుక్య రాజగు గుణగ విజయాదిత్యుడు పట్టాభిషేకమైన మొదటి సంవత్సరమును జెప్పుచున్నది కనుక నిది సుమారు క్రీ. 844 ప్రాంతమునకు జెందిన రచన గావచ్చునని వారు నిర్ణయించిరి. ఆ మొదటి యేడు పండరంగుడను నాతడు సేనాధిపతిగ పట్టము గట్టబడెననియు, రాజుచే పంపబడి సామన్త సేనతో పణ్డొఱ్ఱిణ్డు బోయ కొట్టములను వశము చేసుకొని కట్టెపు దుర్గమును తెలపించి కన్దుకూరు (నగరము) ను బెజవాడతో సమానముగ చేసెననియు ఇందు జెప్పబడెను. వేరు విధముగగూడ కొందఱు చెప్పిరి.

ఈ పద్యము తరువోజ. ఇందు ద్విపదలోని పాదములు రెండేసి కూడి యొక పాదమగును. ప్రాస, యతులు గలవు. ఈ క్రింది మూలము శ్రీ జయన్తి రామయ్య పంతులుగారి శాసన పద్యమంజరి నుండి గ్రహింపబడెను.

**మూలము :**

పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు
బలగర్వ్వమొప్పంగ బైలేచి[1] సేన
పట్టంబు గట్టి ఞ్చి[2] ప్రభు పణ్డరంగు[3]
బఞ్చిన సమన్త[4] పడువతో బోయ
కొట్టంబుల్వాణ్ఱెణ్డు గొణి[5] వేంగి నాణ్డిం
గొఱల్చి[6] యాత్రిభువనాంకుశం బణ[7] నిల్పి
కట్టెపు దుగ్గ్రంబు గడు బయల్సేసి
కణ్డుకూర్బెజవాడ[8] గావిఞ్చె మెచ్చి

వ. పణ్డరంగు పరమ మహేశ్వరుణ్డు ఆదిత్య భటారనికి[9] ఇచ్చిన భూమి యెను బోదివుడ్ల ఆడ్లపట్టు[10] నేల దమ్మపురంబున దమ్ముమవులు వీని రక్షింఞ్చిన వారికి అశ్వమేధంబున ఫలంబు[11] అగు.

1. బొప్పంగంబై లేచి— అని చదువునది.
2. గట్టిఞ్చి ,,
3. ప్రభుంబణ్డరంగుం ,,
4. సామంత ,,
5. కొట్టముల్పణ్డిణ్డుగొని ,,
6. గొళబి-అనియుండనోపు ,,
7. త్రిభువనాంకుశమున ,,
8. కందుకూర్బెజవాడ ,,
9. భట్టారకునకు ,,
10. వుట్లఆళ్ల పట్టు ,,
11. అశ్వమేధంబున ఫలంబు ,,

# 13. యుద్ధమల్లుని బెజవాడ శాసనము

## (క్రీ. 930 ప్రాంతమునాటిది.)

ఇదియు కొరవి శాసనము ఇంచుమించుగ నొకే కాలమునకు జెందినవి. ఈ పద్యములు మధ్యాక్కరలు. శ్రీ జయన్తి రామయ్య పంతులుగారు ఎపి. ఇండికా XV లో ప్రకటించిరి. వారి శాసన పద్యమంజరి నుండి యిచట గ్రహింపబడెను.

1. స్వస్తి నృపాంకుశాత్యన్త వత్సల సత్యత్రిణేత్ర
విస్తర శ్రీయుద్ధ మల్లుణ్డ నవద్య విఖ్యాత కీర్తిఁ
బ్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనాభరనుణ్డు సకల
వస్తు సమేతుణ్డు రాజసల్కి భూవల్ల భుణ్డ్ర్తిఁన్ [1]

2 పరగంగ బెజవాడ గొమరస్వామికి[2] భక్తుణ్డై గుడియు
నిరుపమమతి నృపధాముణ్డైత్తించ్చె నెగి దీచ్చెఁ మఠంబు[3]
గొర గల్గా కొరు[4] లిన్దు విడిసి బృన్దంబు గొని యణ్డువారు
- - రి గాక యబ్బా రణాసి ప్రచ్చిన పాపంబు గొణ్డు

3. వెలయంగ నియ్యేట్టు టిస్సి మలినుణ్డై విడిసిన ప్రోల్[5]
గల తానపతులును రాజుపట్టంబు గట్టిన పతియు
నలియం బయ్యార్వరల[6] వెల్వరించిన నశ్వమేధంబు
ఫలంబు[7] పేఱించిన లింగం బటిసిన[8] పాపంబు దమకు

---

1. వల్లభుణ్డర్థి — అని చదువునది
2. గొమర సామికి ,,
3. మఠము ,,
4. గొరగల్గాక — అనుచో 'ల' కారము తేల్చి పలుకవలయును.
5. విడిసినం బ్రోలం ,, అని చదువునది
6. నలియం బైవారల ,,
7. ఫలము ,,
8. మటిసిన ,,

4. జనమత చేబ్రోల నుండి బెజవాడ జాత్రకు[9] వచ్చి
త్రిణయన సుతుణ్డోణ్డు సోటు మెచ్చక తివిరి యిన్నెలవ
యనఘుణ్డు సేకొని యిన్దు ప్రత్యక్షు బయన్న నిచ్చ[10]
గని మల్లఁతెత్తించె గుడియు మఠంబునుం గార్తిక కేయునకు

దీనింజేబ్రోలు యేలెడు (వా) రతిరంబేలు (వా) రొణ్డు సోటి గొరగ [లూ]ను బెట్టు వెరుగను జను [I *]) యీ స్తితి సేకొణి కాచువార దీనిన్దారు నిల్పిన వారు స్థితి దప్పి యటిపుట వా [వం] బు గాన.

5. రమనతో[812] బెజవాడ కెల్ల బెడంగును రతుయుంగాను
న్దమతాత మల్లపరాజు వేరెఱు దానుంగట్టించెం
గ్రమబున[13] దానిక కలశ బిడ్డట్లుగా మొగమాడు
వమరంగ శ్రీయుద్ధమల్లుణ్డెత్తించె నమితతేజుండు ॥

తన ధమ్మ్రవు వోడంబడి కాచున్నృపుల కున్ద—

(అసంపూర్తి)

ఈ శాసనమసంపూర్తియని శ్రీ జయంతి రామయ్య పంతులుగారు భావించిరి. కాని సి. ఆర్. కృష్ణమాచార్లుగారు 'కున్ద' అను పదమునకు స్తంభ మని యర్థము చెప్పి. యుద్ధమల్లుని ధర్మము నొడబడి కాపాడు రాజుల శాసన స్తంభమిది యని దాని కర్థము చెప్పి పూర్తియైనదని చెప్పిరి

యతిస్థాన విషయమున నన్నయ అక్కరలకును ఈ శాసనమందలి అక్కర లకును సాదృశ్యమున్నదని ఆచార్య వెంకటావధానిగారు తెలిపిరి. వానిలో గూడ నైదవ గణము మొదటనే యతి కన్పించు చున్నదని వ్రాసిరి. తర్వాత కవులును కవిజనాశ్రయకర్తయు నాలుగవ గణము యొక్క మొదటి యక్షర

9. జాతరకు అనునది సాధురూపము
10. యిందుం బ్రత్యక్షమైయున్న నిచ్చం—అని
11. మఠమును అని చదువునది
12. రమణతో ,,
13. గ్రమమున ,,
14. మిడ్డట్ల ,,

మునే యతిస్థానముగ చెప్పిరి. ఈ శాసనమందు కొన్ని తావులందు గణములు తప్పినట్లగుపడుచున్నను ఆధునిక లిపి ననుసరించి వ్రాసినచో అట్టి లోపములు సరియగునని వ్రాసిరి. అందుకు వారు కొన్ని సవరణలను చేసిరి.

మల్లుణ్డనవద్య - మల్లుఁడనవద్య అని వ్రాయవలెను.
వల్లభుణ్డర్థిఙ్ - వల్లభుడర్థిఙ ,,
బెజవాడం గొమరు స్వామికి భక్తుణ్డై - బెజవాడ గొమరుసామికి భక్తుఁడై ,,
నృపధామ డ్డైత్తించ్చె - నృపధాముఁడెత్తించె ,,
నలియం బయ్యార్వల - నలియ బైవారల ,,

మున్నగునవి.

ఇట్టి సవరణలు సాధారణముగ నప్పటి గణబద్ధములగు పద్యములన్నిటిలోను అవసరమగు చుండును నన్నయ తరువాతకూడ శాసనము లందలి పద్యము లిట్లే వ్రాయబడు చుండెను. ఆనాటి భాష పలుకుబడియే అంత, 'పృథివి' కి 'ప్రిథివి' ; 'పరివృతుండు' అనుటకు 'పరివ్రుతుండు' ; 'నృపుడు' అనుటకు 'నిృపుడు' అనుటయు ఆనాడు మామూలు. పద్యములలోగూడ అట్లే వ్రాసి పూర్వాక్షరములు గురువు కాకుండ తేలికగ పలుకువారని తెలియుచున్నది.

# 14. జినవల్లభుని కుర్క్యాల శాసనము[1].

ఇది కరీంనగరు జిల్లాలో కుర్క్యాల గ్రామము వెలుపల ఒక కొండపైన జినవిగ్రహములు, చక్రేశ్వరి యను శాసనదేవి ప్రతిమలకు క్రింద వ్రాయబడిన సంస్కృత, కన్నడ, తెలుగు పద్యములతో గూడిన శాసనము. ప్రసిద్ధ కన్నడ కవియగు పంపని తమ్ముడు జినవల్ల డీశాసనము ను వ్రాయించెను. ఇందే పంపని పూర్వులు తెలుగు దేశములోని కమ్మనాటి (గుండ్లకమ్మ తీరము) లోని వంగిపఱ్ఱు గ్రామమునకు చెందిన వారనియు, వేములవాడ చాళుక్య రాజుల ఆశ్రయమునుబట్టి సబ్బిమండలము చేరిరనియు తెలియుచున్నది. పంపడు కన్నడమున విక్రమార్జున విజయము, ఆదిపురాణము అను ఉద్గ్రంథములను రచించి ఆఖాషయందాదికవి యని ఖ్యాతినొందెను. అతడు తెలుగున కూడ నేమియైన స్వల్పకావ్యములు రచించెనేమో తెలియదు. కాని అతని సోదరుడీ శాసనమును రచించెనని చెప్పవచ్చును తానుకూడ గొప్ప విద్వాంసుడనని ఇందాతడు చెప్పుకొనెను. తెలుగులో నన్నయకు పూర్వము కంద పద్యములున్నట్లు ఇంతవఱకు తెలియదు ఇందు మూడుకందపద్యములు కలవు ఇవి జినవల్లభుని రచనయనియే చెప్పదగును. ఈ శాసనకాలము సుమారు క్రీస్తు 945 అని చెప్పవచ్చును అంటే నన్నయకంటె సుమారు నూరుసంవత్సరములు ముందుది. తెలుగులో మనకిప్పటికి తెలిసిన మొదటి కందపద్యము లివియే.

1. కంద॥ జినభవనంబు లెత్తించుట (భవనము లెత్తించుట అని చదువవలెను)
జినపూజల్సేయుచున్కి జినమునులకు న
త్తిన యన్నదానం బీవుటం
జినవల్లభు బోలంగలరె జినధర్మ పరుల్ ........ ......

2. దినకరు సరివెల్గుదుమని
జినవల్లభు నెట్టునెత్తు జితకవినననుం
మనుజుల్గలరే ధాత్రిం (మనుజులు గలరే ధాత్రిన్ = అనిచదువవలెను)
విని తిచ్చిదు ననియ వృత్త విబుధ కవీంద్రుల్.

3 ఒక్కొక్క గుణంబు కల్గుదు
రొక్కొణ్ణగా కొక్కలక్క శేవెవ్వరికిం
లెక్కింప నొక్కొ లక్కకు
మిక్కిలి గుణపక్షపాతి గుణమణి గుణంబుల్.

1. ఎపి. ఆంధ్రికా II లో డా. నేలటూరి వెంకట రమణయ్యగారి వ్యాసమునుండి.

# 15. బణపతి దీర్ఘాసి శాసనము. (శకము. 997).

కలింగపట్నమునకు నాలుగుమైళ్లు ఉత్తరముగ దీర్ఘాసి యను గ్రామము కలదు. అచట దుర్గమెట్టయను కొండపై నొక శిథిలాలయమువద్ద నీశాసనము కలదు. దీనియందు కొంత సంస్కృతభాగము; మిగిలినది తెలుగు పద్యభాగము.

గంగాన్వయమునకు చెందిన రాజరాజు కళింగదేశమును క్రీస్తు 1068 నుండి 1076-77 వరకు పాలించెను. అతని మాణ్డలికులలో నొకడు బణపతి యనువాడు ఈశాసనమును వ్రాయించెను. దీర్ఘాసినగరమున దుర్గాలయము నకు ముందు తానొక మణ్డపమును నిర్మించి. శతాబ్దము 997 న ఆదేవికి అఖండ దీపమునకై దానమొసగినట్లు ఈ శాసనమందు కలదు. అతని భార్యయు మఱియొక దీపమునకు దానము చేసెను. ఈ బణపతి తన యేలిక పంపున చోడరాజును (మొదటి కులోత్తుంగుడు), వడ్డదేశమును, కిమిడిదేశమును (పర్లాకిమిడికి) గొడ్రిసింగ (తెలియదు)వేంగిదేశముమ జయించినట్లు చెప్పవడెను. బణపతికి చలమఱ్ఱిగణ్డ, భణ్డన విజయ, గణ్డగోపాళ అనుబిరుదులు చెప్పబడెను.

(తెలుగు భాగములోని పద్యము)

సీ. శ్రీ శకునేణ్డు[1] భూపతిపై నైల
 న న్నాబ్జభవసంఖ్య నొంద వేంగి
దేశంబు గిమిడియ(యు) గోసల గిడ్రిసింగి
 దేశంబు మఱియొడ్డ దేశమనంగ
జనిన భూపాలుర ననినొచ్చె[2] చలమఱ్ఱిగ
 గణ్డడై నెగడిన మణ్డలికుణ్డు
భూసుర వంశుణ్డు వాసవ నిభభోగి
 బణపతి సౌజన్య గుణయుతుణ్డు

---

1. నేణ్డులు - అని చదువవచ్చును.
2. నోడ్చెన్ - అని భధున వలయును

దీర్ఘాసి భగవతిదేవి దేవాలయ
మున ముందటం గడు ఘనతరముగ
మణ్డపమెత్తించె భణ్డన విజయుణ్డు
గణ్డగోపాలుణ్డఖణ్డవర్తి
దీవియ వెట్టె నద్దేవికి నవ్వేలం
దన మనోవల్లభి వనజనేత్రి
దీవియవెట్టెం బద్మావతియును క్షోణి
నశశులు[3] గలయంతకును ముదమున

గగన భూమి చంద్ర ఖరకరోదక శిఖి
మారుతాత్మమూర్తి మహిష మథన
యిష్ట పూర్త[4] ఫలము లెల్లకాలంబును
మెచ్చుతోడం దమకు నిచ్చుచుణ్డు

3. క్షోణి యనశశుల్ - అని చదువ వలయును,
4. యిష్టాపూర్త ఫలమ్ములు అనునది సాధురూపము,

# 16. గూడూరు శాసనము.

## (చాళుక్య విక్రమశకము. 49, క్రీస్తు. 1124.)

ఈ శాసనము జనగామ తాలూకా గూడూరు గ్రామమున నొక శిలా స్తంభముపై నలువైపుల వ్రాయబడినది అందొకవైపుది మాత్రమే తెలుగుది. మిగత మూడు ప్రక్కల కన్నడములో వ్రాయబడిన శాసనము కలదు. అదియు నిదియు ఒకే లిపికి చెందినవి. ఒకే వ్రాతకాడు చెక్కెను. భాషమాత్రమే భేదము. పైగా తెలుగు భాగములో ప్రశస్తి పద్యములుతప్ప వేరు దానాదికము గాని సంవత్సరము మున్నగు విశేషములుగానిలేవు. శాసనములందెచ్చట అట్టి కేవల ప్రశస్తితోనే యుండు సందర్భములులేవు. కన్నడ భాగములో చాళుక్య చక్రవర్తి యగు ఆరవ విక్రమాదిత్యుని (క్రీ. శ. 1076-1127) పుత్రుడును, యువరాజును అగు కుమారసోమేశ్వరుడు కొలనుపాక రాష్ట్రమునకు మహా మండలేశ్వరుడుగనుండి అతని దండనాయకుడగు స్వామివయ్య విన్నపమున గుముడూరులో విరియాలమల్లడు నిర్మించిన మల్లేశ్వర శివాలయమునకు చాళుక్య విక్రమశకము 49వ సంవత్సరములో బమ్మెర గ్రామమును దాన మొసగినట్లు చెప్పబడెను. తర్వాత విరియాల మల్లని తాతతండ్రుల ప్రశస్తిగల పద్యములు కన్నడములో గలవు. ఆ తరువాత నాలుగవవైపున అదే విరియాల వంశము వారి ప్రశస్తి తెలుగు పద్యములలో గలదు. కాకపోతే, మల్లన తాతదండ్రుల ప్రశస్తి కాక ఇది వేరే వ్యక్తుల ప్రశస్తి. వీటిలో తుది పద్యము విరియాల సూరనను గూర్చినది. కన్నడ పద్యములు సూరన ప్రశస్తితో ప్రారంభమగును. కనుక మల్లని తాతయగు ఆ సూరడు, తెలుగు భాగములో తుది యందు జెప్పబడిన సూరడు ఒకరేయగుటలో ప్రతిబంధకమేమియు లేదు. ఇంతకు, తెలుగు భాగములో దానమునుగూర్చిన విషయమేమియులేని కతన అది శాసనాంతరము కాజాలదు లిపికూడ భిన్నముకాదు. భాషయు, విషయమును మిగిలిన దాని నుండి భేదించును. ఆ భేదమును పై తెలిపిన విధముగ సరిపెట్టుకొనక తప్పదు కనుక గూడూరు శాసనమందలి పద్యములు నన్నయకు ముందువికావు. నన్నయ తర్వాత సుమారు నూరేండ్లనాటివి. అందలి విషయముమటుకు నన్నయకు

పూర్వము జరిగినది. అనగా మల్లని తాతయగు సూరని తల్లిదండ్రులనుకొన బడు విరియాల ఎఱ్ఱన, కామవసానులుచేసిన ఘనకార్యములిందు వర్ణించబడి నవి. మల్లడు క్రీ 1124 నాటి వాడు గనుక అతని ముత్తాత నూరులేక నూట పాతికేండ్ల క్రిందటివాడు కాదగును. ఈ విధముగ నీ శాసనమును క్రీ 1124 నాటిదిగ చెప్పినచో నన్నయకు పూర్వము వృత్తములలో రచింపబడిన తెలుగు పద్యములున్నవా లేవా అను సందియము తదవస్థముగనే యున్నది.

ప్రస్తుతము మనము తెలుగు పద్యములనుగూర్చియే విచారింతము. ఇది సరిగా అర్థముకాకుండుటతో, కొరవి శాసనమువలె, అందు జెప్పబడిన చరిత్రాంశములు సరిగా మనకు తెలియవు. అది వ్రాయునాటికి మల్లడికి కూడ సరిగా తెలియవేమోననిపించును. రెండవ విషయము, పద్యములలోని భాషలో కొన్ని తప్పులు గలవు. దానికి తోడు కొన్ని పదములు మనకు సరిగా అర్థము కాకుండుట. ఈ కారణములవల్ల ఈ గూడూరు శాసనములోని పద్యములు పూర్తిగా తెలియుటలేదు.

కొరవి శాసన సందర్భములోవలె ఇచటకూడ ముందు కొంత చరిత్రాంశమును పరిచయముచేసుకొనిన శాసనమందలి పద్యములు కొంత అర్థము కాగలవు. తెలుగు భాగమున జెప్పబడిన చరిత్ర విరియాల వంశమునకు చెందినది. దుర్జయాన్వయమున వెన్నడనువాడు పుట్టెను. అతనికి నెఱ్ఱభూపతియు, నితనికి విరియాల భీమడు నృపఘస్మరుడై యుదయించెను. ఇతనికి మఱల యెఱ్ఱ నరేంద్రుడు జన్మించెను. ఈయెఱ్ఱనృపతి బొట్టుబేతరాజును చేతబట్టి (ఆశ్రయించి) వాని వైరిని జంపి కొరవి దేశములో నాతని ప్రతిష్ఠించి తత్ప్రతి ఫలముగ వాని వలన వాతని పుత్రునిపేరును తన దాయమునకు పెట్టుకొనుట కనుమతిని, విస్తారముగ ధనమును, మొగడుపల్లికి చెందిన పన్నెండు గ్రామముల అధికారమును పొందెను. తరువాతి పద్యములో ఆ యెఱ్ఱనృపుని భార్యయగు కామవసాని గరుడుడను పేరుగల కాకతిరాజు నొకని పిన్నవయస్కునిచేతబట్టి గొప్పవాడగు బల్లవ (బల్లహ) రాజు యొక్క ప్రాపు జేరి భాస్కర విభు చక్రవర్తిని జూచి (వాని యనుగ్రహమును బొంది) కాకతి వంశమును నిలబెట్టిన కీర్తి నార్జించెను. తుది పద్యమున సూరడను వాని ఘనత చెప్పబడెను, కాటయ నాయకుని జంపి వేలుపుకొండకు చెందిన రవ్వనృపుని ఆ వేలుపుకొండయందు

నిలిపి వానివలన ముప్పదిమూడు గ్రామముల యధిపత్యమున్ను బోదిపాడు, బేకుమామిడ్లు గరెడెయరాజు నెయ్యము సంపాదించెనని చెప్పబడెను.

ఈ పద్యము లైదింటిలోను కీర్తింపబడిన విరియాల వంశజుల ఘనత స్థూలముగ అర్థమగుచున్నను, సూక్ష్మముగ యోచించిన చరిత్రకందని విషయములు కొన్ని పొడగట్టుచున్నవి

దుర్జయుడు విరియాల వంశమున కాది పురుషుడని చెప్పబడెను. ఈ విధముగ తెలుగునాట ననేక నాయకవంశములు దుర్జయుని తమ మూలపురుషునిగ జేర్కొనుట పరిపాటి. అది అంత గణింపదగిన విషయముగాదు. వెన్నడు తరువాత జెప్పబడెను. ఇట్లు దుర్జయుడు-వెన్నరాజు కాకతీయులకుగూడ మూలపురుషులుగనిటీవల బయల్పడిన బయ్యారము శాసనములో జెప్పబడిరి.

ఇది కాకతీయులు, విరియాలవారు - ఇద్దరి విషయములోను కడుప్రాచీన కాలమునకు జెందినది గనుక శాసనకాలము నాటికి అనగా క్రీ. 1124 నాటికి సత్యదూరమై కేవలము ప్రశస్తి కొరకేర్పడిన యంశమనిపించును. ఆ వెన్నరాజుకి ఎఱ్ఱడను వాడు జన్మించెనని చెప్పి మొదటి పద్యముముగియును. దీనిలోని దుర్జయుడు, వెన్నడు, ఎఱ్ఱడు అను ముగ్గురు కాకతీయులలోగూడ నుండుటచే ఈ పద్యము కాకతీయుల కన్వయించునో, విరియాల వారి కన్వయించునో సందియ మొకటి తట్టును. కాకతీయులకే చెందుచో రెండవ పద్యము నుండియే విరియాలవంశము చెప్పబడినదనుకొనవలెను. విరియాలపదముకూడ రెండవ పద్యమునందే యున్నది. విరియాల పదము మల్యాల పదమువలె ఊరి పేరాలేక మఱి యేదైనా పేరా అని యింకొక సందేహము. ఏలయన నీ పద్యములో భావితకీర్తి

నాథ[ని-] పాండవ మధ్యమ భీముడోయనం
గా విరియాల భీమనృప ఘస్మరుడై యుదియించె".

అను దానిలో ఉదయించినదెవరు? పాండవ మధ్యమ భీమునిపోలిన విరియాల భీముడనవలెను. 'భీముడు'-అని తత్సమముగా ఆపదములేదు. అట్లే *విరియాలుడని* కూడలేదు. అందుచే *విరియాలభీమ* అనుదానినే కర్తచేయుట ఉచితమని తోస్తుంది. విరియాల భీముడుదయించెను అనవలెను. అప్పుడు పైమన్న

శావితకీ ర్తివాత[ని-] అనుచోట చివరి అక్షరమునెట్లు పూరించవలెనో తెలియదు. వాతనికి అని కొందరు పూరించి పై పద్యముతో నన్వయించుచున్నారు ప్రస్తుతము అప్పుడు పై పద్యములో జెప్పబడినవారుకూడ విరియాలవంశమువారే యగుదురు. కావచ్చును. ఈ రెండవ పద్యములో 'విరియాలభీమ' అనునది ప్రథమైకవచనములో తత్సమ రూపమని యంగీకరించవలెను.

ఆ భీమునికి ఎఱ్ఱనృపు డుదయించెను. ఇతడు బొట్టు బేతరాజును ఆశ్రయించి వాని శత్రువునిజంపి వానిని కొరవి దేశములో రాజుగజేసెనట. ఈ మధ్య లభించిన క్రివ్వక గ్రామ దాన శాసనములో ముదుగొండ చాళుక్య వంశమునకు చెందిన కొందరు రాజులు చెప్పబడిరి. వారిలో దాతయగు కుసుమాదిత్యుడు అతని తమ్ముడగు నాగతిరాజు, బొట్టుబేతరాజు యొక్క పుత్రులని చెప్పబడిరి. ఆ రాజులది కొరవిదేశమేనని ఆ శాసనములో చెప్పబడింది. కనుక అందలి బొట్టు బేతరాజు యీ గూడూరు శాసనములోని బొట్టుబేతరాజని చెప్పవచ్చును. కాని యీ యూహకొక పెద్ద -టంకము కలదు. ఇతని కొడుకులుగా చెప్పబడిన కుసుమాదిత్యుడు, నాగతిరాజు ఇరువురు కాకతి గణపతిదేవునిస మకాలము వారుగా శాసనాంతరములవల్ల తెలియవచ్చుచున్నారు. అంతే క్రీస్తు 1220 ప్రాంతములోనివారగు వీరియొక్క తండ్రియగు బొట్టు బేతరాజు 1150 కంటె పూర్వము వాడు కాజాలడు. మరి గూడూరు శాసనమే. క్రీ. 1124 నాటిది కదా అంతకు ఇంకా నాలుగైదు తరములనాటి చరిత్ర కదా యిది కనుక క్రివ్వక శాసనమందలి బొట్టు బేతరాజే యితడు కాజాలడు. అతనికి నాలుగైదు తరములకుముందు వాడుకావలెను. అందుచే ఆ క్రివ్వక శాసనములో వంశములోని వారందరు చెప్పబడలేదని నిశ్చయమగుచున్నది. మొత్తముమీద ఆ వంశమువాడేనని చెప్పవచ్చును. బొట్టు అను పదము స్థలనామముగా అ క్రివ్వక శాసనంలో కనిపిస్తుంది. కనుక ఆ వంశములో ఏ బేత రాజైనను బొట్టుబేతరాజేయగును. కాని అట్టి వ్యక్తియు మనకు ప్రస్తుతము తెలియ వచ్చుటలేదు.

ఆతనికి కొరవిదేశము నష్టముకాగా తిరిగి విరియాల యెఱ్ఱడు వాని వైరిని చంపి ఆతనిని కొరవిలో ప్రతిష్ఠించెనట. దానికి ఫలముగా ఆ బొట్టు బేతరాజువలన వానిపేరు గుర్తుగల పేరు తన సంతతికి పెట్టుకొనే అనుమతిని, కొంత ధనమును, పన్నెండు గ్రామముల మొగడుపల్లి ప్రభుత్వమును పొందినట్లు చెప్పబడెను.

ఇది మూడవపద్యార్థము : ఇందు చరిత్రకు చెందిన సందేహము లింకను గలవు. నాలుగవ పద్యములో వాని యంగన (భార్య) కామవసాని చిన్న వాడగు గరుడుడను కాకతిరాజును చేబట్టి (కాపాడి) బల్లవ (హ) రాజు యొక్క ఆశ్రయము చేరి చక్రవర్తి యనుగ్రహము వడసి కాకతి వంశమును ప్రతిష్ఠించెనట. అంటే కాకతివంశము పతనమగు సమయమున ఆ కామవసాని రక్షించినదని తాత్పర్యము. ఇచటగూడ చరిత్రాంశము చాల దురూహముగ నుండును. కాకతి మొదటి బేతరాజునకు గరుడుడను బిరుదనామమున్నట్లు బయ్యారం శాసనములో చెప్పబడెను. అతని సమయములో కాకతిరాజ్యమెట్లు పతనోన్ముఖమయ్యెనో యోచింపవలెను. స్త్రీయగు కామవసాని రక్షించుటేల? ఇట్లు కాకతివంశమును కుంతలదేవి యను నొక స్త్రీ నిలబెట్టి రాజ్యమేలినట్లు సిద్ధేశ్వర చరిత్రలోగూడ చెప్పబడెను. కనుక కామసాని కాకతి వంశమును నిలబెట్టిన మాట నిజమే. ఆమె కట్టి యనురాగము గరుడ బేతనియం దేల కలిగెను? వానికి ఆమె మేనయత్తయని సిద్ధేశ్వర చరిత్ర చెప్పుచున్నది. అంటే బేతరాజు యొక్క తండ్రియగు పిండిగుండరాజుకి ఆమె తోబుట్టువు అయినను ఆమె భర్త యెఱ్ఱనృతియే సహాయము చేయవచ్చు కదా! అట్లు జరగలేదు. పై పద్యములో నతడు బొట్టు బేతని వైరిని చంపెనని కలదు ఆ వైరియే పిండిగుండడు అతడే కొరవిని ఆక్రమించుకొని బొట్టు బేతరాజునో లేక యతని తండ్రినో తరిమివైచెను. అంత నుదుగొండ రాజులు కొరవిని విడిచి బొట్టు అనుచోట ఆశ్రయము కల్పించుకొని కొంత కాలము గడిపిరి ఆ బొట్టు ప్రస్తుత మేగ్రామమో తెలియదు. పాలవంచ తాలూకాయందలి అడవిలో నేదో ప్రాంతము కావచ్చును.

ఆ బొట్టు బేతని సేనానాయకుడు కానవచ్చును విరియాల యెఱ్ఱడు. స్వామిభక్తి కొలది శావమఱదియైన పిండి గుండని చంపి కాకతి వంశమునకు ముప్పు తెచ్చెను. గరుడ బేతరాజు చిన్నవాడగుటచే నేమియు చేయలేని స్థితిలో నుండెను. రాజ్యములేదు. కనుక పుట్టినింటి వారి వంశమును రక్షించవలెనను కోరిక కామవసానికి కలుగుట సహజము. ఆ గరుడ బేతరాజును ఒకానొక బల్లవరాజు యొక్క సహాయమున చాళుక్య చక్రవర్తి యొద్దకు గొనిపోయి అనుమకొండ రాజ్యమిప్పించి కాకతి వంశమును నిలబెట్టెను. పిండి గుండని వఱకు కాకతీయులు రాష్ట్రకూటులకు సామంతులుగ నుండిరి. వారి తదనంత

రము క్రీ. 973 లో పశ్చిమ చాళుక్యులు రాజ్యమునకు వచ్చినపుడు పిండిగుండడు వారికి లొంగక కొరవి రాజ్యమును తన యధీనమందే యుంచుకొని స్వతంత్రుడును అయియుండును. బొట్టు బేతరాజీయదను చూచుకొని చాళుక్యుల ప్రాపుచేరి పిండిగుండని యెఱ్ఱనిద్వారా చంపించి తన కొరవి రాజ్యమును తిరిగి పొందెను. కనుక చాళుక్య చక్రవర్తికి ఎఱ్ఱని యెడ అభిమాన ముండి యుండును ఈ లోపున నెఱ్ఱడు మృతి జెంది యుండినను కావచ్చును. అతనికున్న పలుకుబడిని వినియోగించి కామవసాని కాకతిగరుడ బేతని అనుమ కొండలో సామంతుడగునట్లు పాటుబడి వంశమును నిలబెట్టెను. 'కాకతి నిల్పుట కోటి సేయదే' అని పద్యములోని భాగమునకి యర్థము. ఇచట బల్లవరాజెవరో తెలియదు. భాస్కర విభుచక్రవర్తి యెవరో తెలియదు. భాస్కర నిభుభు చక్ర వర్తి యని కొందరు దిద్దిరి. సూచన బాగానే యున్నది. అయినను ఆ చక్రవర్తి పేరు తెలియదు. ఇది జరిగిన సమయము క్రీ. 1000 లకు కొంచెము ముందని ఊహించవచ్చును. పిండిగుండడు క్రీ. 956 నాటిదగు మాంగల్లు శాసనములో తెలియవచ్చు చున్నాడు కనుక రాష్ట్రకూట పతనానంతరము కొంతకాలమున కీతనిని విరియాల ఎఱ్ఱడు వధించి యుండును అనగా సుమారు 990 ప్రాంతము లోని విషయమిది. ఇది నాలుగవ పద్యమునందలి చరిత్రాంశము.

అయిదవ పద్యములో నొక సూరని ఘనత వర్ణింపబడెను. అతడు కామవసాని పుత్రుడే యగునని పలువురి యభిప్రాయము. లేకున్న యెడల సంగతి కుదురదు. అతడు వేలుపుకొండ (నేటి జఫర్ ఘడ్) ప్రభువగు కాటయ నాయకు జంపి వేరొక రవ్వ నృపతిని వేల్పుకొండ యందు ప్రతిష్ఠించెనట ఈ రవ్వనృపతి యెవ్వరో తెలియదు. ఆతడు పిన్నవాడైన కాకతి గరుడ బేతడే కావచ్చునని కొందరు, కాదు వేరే మరియొక నాయకుడని కొందరు చెప్పు చుండిరి. అతనిని నిలబెట్టుటని సూరలికు 33 గ్రామముల యాధిపత్యము, నేరెడు, బోటిపాడు, బేకు మాలిడ్లు, గరెండెయ రాజుయొక్క మైత్రి చేకూరెనట. వీటిలో కొన్ని పదములకు అర్థము తెలియదు. నేరెడు అనునది 'నేలెడు' అని కాదగునని కొందరు చెప్పుదురు. నేరెడు, బోటిపాడు, బేలమాలిడ్లు అనునవి మూడు స్థలనామములే యగునని కొందరు భావించెదరు. గరెండెయ రాజనగా కాకతీయ మొదటి బేతరాజు. అతనికే గరుడ బేతరాజని పేరు కలదు. 'ర' 'ల' లకు భేదము నంతగా పాటించుట లేదు యీ రచయిత. అందు

చేతనే 5వ పద్యములో ప్రాసస్థానమున 'ల' కు బదులు 'కారకకాలుడై' యని 'ర' ను వాడినాడు. 'కాలకకాలు' డనుటయే యుక్తము అనగా 'కాలయముడు' లేక 'కాలాన్తకుడు' అని అర్థము. ఈ సూరడే కన్నడ భాగములో జెప్పబడిన మల్లన తాతయగు విరియాలసూరడు. ఇది యైదవ పద్యము. కొమ్మోజన బరహ అని కన్నడములో కొమ్మోజు వ్రాసెనని చెప్పబడెను. దీనివలన పైకన్నడ శాసనమును వ్రాసినది కూడ నితడేనని యర్థము గనుక అది, ఇది అంత ఒకరే వ్రాసిరనవచ్చును. 'అడపగట్టు దేవరకుజను' అని తుది వాక్యము. అంటే తాంబూలము దేవరకు ఇచ్చితినని కొమ్మోజు చెప్పుకొనెను. తన కిచ్చిన కూలి దేవుని కని యర్థము.

ఈ విధముగ గూడూరు శాసనములోని చరిత్రాంశమును కొంతవఱ కిప్పుడు చెప్పగలుగుచున్నాము. ఇది కాకతీయుల మొదటి చరిత్రకు, కొరవి రాజులైన ముదుగొండ చాళుక్యుల చరిత్రకు చాల ముఖ్యమైనది' కాని పూర్తిగ అర్థముకాదు. కన్నడ లేఖకు డగుటచే తప్పులుగూడ కొన్ని గలవు. ఇందలి విషయము క్రీ. 1000 ప్రాంతమునాటిది. శాసనము క్రీ 1124 నాటిది.

**శాసనమూలము :**

1\. చ. అనుపమ దుజ్జ యాన్వయ సుధాబ్ధి ననేకులు రాజనందనులు
పనిన బోఅంటి వెన్నడను సంభవుడయ్యె నతిప్రసిద్ధుడై
వినుత విరోధి మణ్డళిక వెన్నడు వెన్ను డె (డ) వోలెవానికిని (న్)
ఘనుడగు నెఱ (ఱ్ఱ) భూపతి జగద్వినుతుండు [ద] యించె
గీర్తితోను ॥

2\. ఉ. భావిత కీర్తినాథ [ని–] పాండవ మధ్యమ భీముడోయనం
గా [వి] రియాల భీమ నివ ఘస్మరుడై [యు] ది (ద) యించె
వానికిను
భూవినుతుణ్డు మండళిక భూప [ణు] డె ఱ (ఱ్ఱ) నరేంద్రుడుత్తమ
(శ్రీ)వినుతుండు బంధుజన సేవ్యుండు దా నుదయించె నున్నతిని ॥

3. చ. ఆతణ్డని బొట్టు చేత వసుధాధిపు జేకొని వానివైరి మ
ద్ధి౻ (ద్ధ్ర) తమున జంపి యాకొరవి దేశమునందు ప్రతిష్ట (ష్ఠ) జేసిత
త్తనెయురు పేరు పోడగల దాయము విట్టఱ గద్యానంబున
ప్రతిముడు వానిచే మొగడు పల్లియు వంద్ర (ద్రె) డు నేలునప్పుడే॥

4. చ. అరుదగునట్టి ఎఱ (ఱ్ఱ) నృపునంగన గామవసాని యొక మే
ల్గరుండని చేత భూవిభుని గాకతి వల్లభు విన్న వాని దా
బరగంగ జేతబట్టి ఘను బిల్లవరాయని యోగి జొచ్చి భా
స్కర విభు చక్రవర్తి గని కాకతి నిల్పుట గోటిసేయదే ॥

5. ఉ కారక కాలుడై వడసె గాడయ నాయకు జంపి సూరడ
వ్వేలుపు గొండ రవ్వ్రనిపు వేలుపు గొండ ననిల్పి వానిచే
మేలుగ మూడ ముప్పయిని మేలుగ నేరెడు బోటి పాడు నుం
మేలుగ జేకు మావిడ్లు మేలుగ రెండెయ రాజు సంగడ్లు (డుల్) ॥

సూత్రధారి కొమ్మోజన బరహా శ్రీ శ్రీ శ్రీ
అడవగట్టు దేవరకు జను.

శకము 1067 నాటి చేబ్రోలు శాసన మొకదానిలో భీమయవండ్డడను మాండలికుడు తను దేశిమార్గ కవితలు రెండు చక్కగ చెప్పగలుగుదునని చెప్పుకొనెను.

చ. తలంపు సదర్థ భావమునం దద్గత సూక్తులం గూడ వర్ణనలు
గొలుసు గొనంగ ప్రావడ్లు గోరిన భంగికవచ్చి ముట్టం గో
మలగతి దేసి మార్గములు మట్టుపడం గ్గటనంబ్బు లొప్ప
నాద్యుల క్రియం జెప్పనేర్పె నృవధూర్జటి భీమయవండ్డ డిమ్మహిని.

# 17. ఉప్పరిపల్లి శాసనము.

## (క్రీ. శ. సం. 1157.)

కావ్య దృష్టిలోను చక్కని కవిత్వములోను పేర్కొన దగినదీ శాసనము. దీనిని కాకతిగణపతి దేవుని ప్రసిద్ధ దండనాయకుడైన, రేచెర్ల రుద్రిరెడ్డికి మంత్రియగు కాటయ వేయించెను. కరీంనగరుజిల్లా హుజూరాబాదు తాలూకా గొడిశాల గ్రామము దగ్గర ఉప్పరపల్లి యనుచోట నొక శివాలయము వద్ద నున్నదీ శాసనశిల. శకము 1157 (క్రీ. 1235) వ సంవత్సరమున వ్రాయబడెను. ఇందు గమనించదగిన విషయము. తెలుగు శాసనము లందిప్పటివరకుగాన వచ్చు లోపము లనేకములు తొలగినవి. శాసనములు కూడా చక్కగ వ్రాయ దలచినచో నిర్దుష్టముగ గ్రాంథిక భాషలో వ్రాయనేర్చిరని యీ రచన నిరూపించును. ఒక్క అరసున్న నుపయోగించ కుండుట తప్ప మిగతావ్రాత లోపము లన్నియు పోయినవి. అరసున్నకు బదులు పూర్ణానుస్వరమునే యింక వాడుచుండిరి దీనిని బట్టి అనాటి తాళపత్ర గ్రంథములలో కూడా తెలుగు కావ్యములు వ్రాయునపుడు అరసున్న లేదని వ్యక్తమగుచున్నది నిందు సున్నాను వ్రాసినను చదువునపుడు మాత్రము ఛందోను గుణముగ దానిని పలుకుటయు పలుక కుండుటయు చేసెడి వారని గ్రహించవలెను. సరిగా నప్పటికి మూడు శతాబ్దులకు పూర్వము దైన జినవల్లభుని కందపద్యములను ఈ శాసనమందలి కందపద్యములను పోల్చిచూచిన కవన భాష యెంత మార్పు నొందెనో తెలియకలదు. 'ణ్డు' కు బదులు 'ండు'; 'ంబు' కు బదులు 'ము' వచ్చినవి. పాదాంతము లందు గాని వేరొండు తావులందుగాని ఛందోభంగముగ తోచు 'ను' మున్నగు అజంతాక్షరములకు బదులు 'న్' అనే హల్మాత్రములు వాడుకలోనికి వచ్చినవి.

| | | |
|---|---|---|
| తనయుండనగాంన్ | — 6 వ | పద్యము |
| రుద్రుండిలన్ | — 7 వ | ,, |
| కాటయకొసంగున్ | — 2 వ | ,, |

నభీష్ట ఫలంబుల్ — 4 వ ,,
దయామతి శుభముల్ — 3 వ ,,

కాని 'ని' యింకా మారలేదు. ప్రీతింని - 5 వ పద్యము
ధాత్రిని - 8 వ పద్యము.

తెలుగువారికి హలంత పదములనుకూడ అజంత పదములుగా నుచ్చరించుట అలవాటు. సంస్కృత పదాలనుకూడ శ్లోకములందున్నను అశ్లో ఉచ్చరించుట, వ్రాయుట వీరికి సహజము. 'శ్రీమాన్ రుద్రయనాయకో' అనుటకు 'శ్రీమాన్ను రుద్రయనాయకో' అని వలుకుదురు. కనుక 'న్' వ్రాయుటకు 'ను' లేక 'ని' అనియు 'ల్' వ్రాయుటకు 'లు' అనియు వ్రాసెడివారు. ఛందోనుగుణంగా చదువవలెను.

## శాసన మూలము

1. ఉ. శ్రీమదనూన దానజలసేవకుం శాయక ప్రోయుపట్పద
స్తోమనినాదమున్వినుచు నూరెల నెప్పుడుం బ్రస్తుతించు సి
ద్ధామరకోటికి న్వరదుండైన గణేశుండు సుస్థిరస్థితిం
గామ సమాన మూర్తిఁ యగుకాటయ కీవుత మిష్టసంపదల్

2. క. చరణ సరోరుహరాగ
స్ఫురణన్మహీమని శిరంబు వొలువుగ సంధ్యా
భ్రరుచి నెనయ మెట్టిన స
త్కరుణాన్విత దుగ్గఁ వరము గాటయ కొస(ం)గున్.

3. క. ఉరగేంద్ర దిగ్గజములకుం
బరమోత్సాహముగ నాతపత్రమువోలె
న్ధర యెత్తిన కిరివరుం డగు
హరి గాటయ కీవుతము దయామతి శుభముల్

4. క. దేవాదిదేవుం డమిత
స్థావరజంగమమయుండు నర్వేఁ శుండు గా
రి (వ) రుం డనవరతంబును
నీవుతం గాటయకు దయ నభీష్ట ఫలంబుల్

5. క. హారిదశ్వుం డజాచ్యుత శం
కరమూర్తిఁ ద్రయీమయుండు గమలాప్తుండు భా
స్కరుండు ద (యం గాచుచుండెడుం)
గరుణారస పూర్ణ్ణ హృదయుం గాటయం బ్రీతిని.

[గద్య]. స్వస్తిశ్రీ మదపారపారావార పరివృత మహీతలంబున సకలజన వినుతం బగునంధ్రదేశంబునకు (వి)భూషణం బైన యనుమకొండ యను పురవరంబు నిజరాజధానిగా నొప్పుచుంన్న కాకతిభూపాల క్రమంబున జనవినుతయశోవిలాసుండును జయలక్ష్మీ నివాసుండును నైన రుద్రనరేంద్రు సుపుత్రుండును సదారాధిత త్రినేత్రుండును విబుధ జనవన వసంతుండును రమణియ్య సీమంతినీజయంతుండును సకల జనమనోరంజనుండును నరాతిరాజ మదభంజనుండును శరణాగతరాజ శరణ్యుండును వినతాఖిల రాజవరేణ్యుండును ధైర్య్యామరసానుమంతుండును దు(రం)గమ రేవంతుండును సత్యహరిశ్చంద్రుండును విభవామరేంద్రుండును నైన గణపతిదేవ మహీనాథునకుం బ్రధానియై.

6. క. కనకాచలధీరుండు జన
వినుత చరిత్రుండు గార్య్యవిదుం డినతేజుం
డనఘుండు గుణనిధి బెజ్జమ
తనయుండు బుధదీనభానుతనయుం డనగాంన.

7. మ. ప్రతిపక్ష క్షితిపాలకుంజర మద ప్రారంభ సంరంభ ము
ద్ధతశాతోనిహిత ప్రచండనిశితోద్యత్ఖడ్గధారానఖా
హతి బేదించి యఖర్వ్వ గర్వ్వ బల శౌర్య్య స్ఫూర్తిం గంఠీరవా
కృతియై (సన్నుత) ప్రవృత్తిదాల్చి వెలసెను రే(చెర్ల) రుద్రుండిలన్.

సకల జన వినుతయశుండును గుణగణాలంకారుండును నైన కామ్రెడ్డికి(ం) సౌభాగ్య సౌందర్య్య చాతుర్య్యంబులు గలిగి పరగిన పరమ పతివ్రతయైన బెజ్జమాంబకుం బ్రియనందనుండును ననవరత ధర్మ్మ సమేతుండును పతిహితాచరణుండునుం గాకేత రాజ్యభార ధౌరేయుండును సద్గుణ ప్రఖ్యాతుండును నతులబల పరాక్రమ సమన్వితుండును నైన రేచెర్లరుద్రునకుం బ్రధాని.

8. క. కులతిలకుండు వసుధామర
జలధి సుధాకరుం డశేషజననుత చరితుం
డలఘుండు రిపుతరు దావా
నలుండనంగాం బరగె రాజెనాయకుం డుర్విఁని.

[గద్య]. బొక్కెరలోని వీరభటావలి వధించి గోధుమ అతి తలదెంచి ఉదగిరి సాధించి పడిరాయనిందోలి దాక్షారామ భీమేశ్వర దేవర కతుయ దీవంబులునిపి ధర్మఁ సమేతుండైన రాజెనాయకునికి ధర్మఁ పత్నియు సుచారిత్రయు వనితాలలామయునైన రవ్వమాంబకు సుపుత్రుండు

9. క. స(శ)ర నిధి గంభీరుండు సు
స్థిర తేజుండు వంశశేఖరుండు దయా
కరుండు బుధాంబుజ దళశత
కరుం డని వన్నిఁ(ర్ణిఁ)ంప నొప్పుం గాటయధాత్రింని.

[గద్య] విశద యశుండైన గణప
తిదేవ భూపాలునకుం బరమ భక్తుండై తన్మహి
నాథు కారుణ్యంబున నతుల విభవ సమేతుండై
వనంబు లొప్పం బెట్టి తటాకంబులు శివాలయం
బులు నిలిపి వినయవివేక సత్యశౌచ త్యాగ
భోగ బల పరాక్రమంబుల జనవినుతుం
డై యభీష్టార్థఁ ప్రదుం డగుచుండ త్రిలోకారాధ్యు
ండైన పరమేశ్వరున కంగభోగార్థఁ
ంబు దనయిచ్చిన ప్రిత్తుల శాశ్వతం
బై ప్రవర్తిఁల్లుచుం డని నిల్పిన సంవత్సర సంఖ్య
శకవర్షఁములు ౧౧౫౭ మన్మథ సంవ
త్సర మాఘ శుద్ధ ౧౫ గురువారము
నందు పంచలింగాలకునూ పించజవల్లి
ని దేవబ్రాహ్మణ ప్రిత్తులు గాక సర్వ్వఁ సమస్య
ముగా నిచ్చె పెంజెఱ్ఱున మీంది కాల్వాను కొ
ంతపుగాల్వ దక్షిణమూను ఆవాంక అడ్డా

ను చింతన మిట్టలూను రవ్వసాని అనకిం
దూను యింతవట్టు గూడను ర్ ౧౩ ॥
ప్రోలకంమ కాల్వను ర్ ౧ చోలు శాడె కాల్వ
ను చుట్టు ర్ ౧ కాట్నాయుని చెఱ్వున బ్రాహ్మ
ణ వ్రిత్తులుగాక సవ్వఙమూంను రవ్వసాని
చెఱ్వూను రవ్వసాని మామిడితోంట వడమ
టి అనాను రాజెనాయంకుని చెఱ్వున ర్ ౭
వెలివోలము యేరువోక గుబ్బలి జగదేవ
త్రోవ దక్షిణమున ర్ ౨౦ దీని దక్షిణము
న పెద్ద రేగటిలోన ర్ ౪౦ బొమ్మకంటె తెర్వు వ
డుమట నుండి వూరివెన తీగవెన నడ్మ ర్ ౬౦
యేటిమడ మామిడివనమూను ఆ వనములోని చింత వ
నమూను ఊరి దక్షిణమున తాటివనమూను
అంగడి సుంకమూను ఇంతవట్టు కాట్నాయ్యయు
ండు దేవర్లకు అంగభోగ రంగభోగ ధూపదీపనైవేద్య
తాంబూలాలకు సూయ్యఙ చంద్రుల కలంతగాల
ము ఇచ్చిన ఈవి [॥*] కాదంన్న వారు గంగక త్తాం గవి
లం బొడిచిన దోషానం బోదురు
కింది కాల్వను ర్ ౧౦ 1 = ఇచ్చితిమి యింతవట్టు గణపతి
దేవమహారాజు విడిచిన దత్తి

కాకతీయుల కాలము తెలుగు దేశమునకు రాజకీయముగను, భాషాభివృద్ధి యందును పేర్కొనదగినది ఇప్పటి ఆంధ్రప్రదేశ రాష్ట్రములో కొలది భాగము తప్ప మిగిలిన దంతయు వారి యేలుబడి క్రింద నుండెను. తెలుగు భాష పుట్టిన పిదప తెలుగువారధిక సంఖ్యలో నొక రాజ్యమున కలిసియుండుట గణపతిదేవుని కాలములోనే జరిగెను. పైన జెప్పిన ఉప్పరపల్లి శాసనములోని భాషయు, కవిత్వము అప్పటివే. తిక్కనగారి ఆంధ్రమహాభారతము, భాస్కరాదుల రామాయణములు ఆకాలమున వెలసిన ఉద్గ్రంథములు. అక్షరలిపి కూడ అప్పటికొక స్థిరరూపము దాల్చెను. కొద్ది మార్పులతో ఆయక్షరముల రూపువే మనము నేడు వ్రాయుచుంటిమి. తరువాత రెడ్డిరాజుల శాసనములు మననేటి తెలుగక్షరములలోనే యుండును. కవి సార్వభౌముని శాసన పద్యములతో నీ విభాగమును ముగించెదము.

# 18. పిరంగిపురము శాసనములోని తెలుగు పద్యములు.

## (శక. 1331.)

ఈ క్రిందిది గద్యవలె నుండును. శ్రీనాథుని సీసపద్యమని వెంటనే తట్టదు. కాని తరువాతి పద్యములు రెండు కవిసార్వభౌముని వనిపించును.

1. సీ. శాకాబ్దములు సహస్రమును మున్నూంట ము
   ప్పదియొక్కండును నైన భవ్య సంఖ్య
వఱలు విరోధి సంవత్సరంబున ఫాల్గు
   నంబున బహుళ పక్షంబు విదియ
శుక్రవారంబున శుభముహూర్తమ్మున
   శ్రీధాన్యవాటి పురాధిపతియుం
గ్రిష్ణవెణ్ణా జలక్రీడా వినోదుండు
   నగు గన్న భూపాలు ననుంగుంబుత్రి

వీరనారాయణుండు వేమ విభుని దేవి
భూరిసద్గుణ నికురుంబ సూరమాంబ
జగము వినుతింప సంతానసాగరాఖ్య
వరతటాక ప్రతిష్ఠోత్సవం బొనచ్చెః.

2. సీ. జాహ్నవీ యమునాది సకల పావన నదీ
   విమల తీర్థాంభః పవిత్రితంబు
స విధదేశస్తా (స్థా)యి శివమౌళి బాలేందు
   కౌముదీ సంపుల్ల కైరవంబు
బహు మహా వరివాహ పాథో భరధ్వాన
   ఘుమ ఘుమాయిత దిశాగోళకంబు
జల సారణీసేక సంవర్ధితానేక
   వన వినీతాధ్వగా ధ్వశ్రమంబు

బలవదురు మత్స్య కచ్ఛప ఘుళి కుళీర
తిమి తిమింగిళ విక్రమ క్రమ విహార
తరళతర తుంగ భంగ కదంబచుంబి
తాభ్రవీథి సంతాన మహాపయోధి.

3 సీ. కపట సూకరమైన కైటభాసురవైరి
ఖురపుటంబులం బరిణుణ్ణమయ్యె
రఘు కులోద్వహ ధను ర్యంత్ర ముక్తములైన
చిచ్చుఅమ్ముల వేండిం జేవదఱ (టి) గెం
గుంభసంభవుని హస్తాంభోరుహాంబున
నాపోసనంబయి[1] ప్రాసమొందెం
బాషాణముల నచ్చ భల్ల గోలాంగూల
కపియూథముల చేతం గట్టువడియె

వనధి యేభంగి సరివచ్చు ననంగవచ్చు
నారసాతల గంభీరవారి యగుచు
నపగతాపాయ మగుచు శోభాఢ్య మగుచు
నమపమంబైన సంతాన వనధితోడ.

శ్లో. విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమ భూపతేః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్.



1. 3వ పద్యములో 'అపోసనంబయి' అనుభాగమును 'ఆపోశనంబయి' అని దిద్దవలెనని శ్రీజయంతి రామయ్య పంతులుగారు సూచించిరి. 'శ' కారమునకు 'స' కారము వాడుట శాసనములందు కలదు. 'వశము' నకు 'వసము' నిఘంటువు లందున్నది. కాని 'దేశము' 'ఆపోశనము' అనునవి 'దేసము', 'ఆపోసనము' అను రూపములలో గానరావు.

# 19. చిడిపిరాళ్ల శాసనము.

## (శకము. 1464.)

(కమలాపురం తాలూక)

మచ్చున కొక విజయనగర కాలమునాటి శాసనముకూడ చూచెదము. ఇది చిడిపిరాళ్ళ గ్రామమునందు అగస్త్యేశ్వరస్వామి గుడిలో నున్నది. ఇందు వీరప్రతాప శ్రీఅచ్యుతదేవరాయ మహారాయలు రాజ్యము చేయుచుండగ శకము 1464 కు సరియగు క్రీ. 1542 సంవత్సరమున వారి సుంకాధికారమును నిర్వహించు కొందరు అగస్త్యేశ్వరునికి తిరువశిక (అఖండదీపము) కొఱకు దానము చేసిన విషయమిందు చెప్పబడెను. తాము చిడిపిఱేల స్థలము నందున్న చెప్పలి గ్రామములో పొందు కొన్ని సుంకముల నిచట దానము చేసినట్లు చెప్పబడెను.

1\. శుభమస్తు । శ్రీ అగస్తీశ్వరాయనమః । స్వస్తి శ్రీ జయాభ్యుదయ
శాలివాహన శక వర్షంబులు ౧౪౬౪ అగునే

2\. ంటి శుభకృతు సంవత్సర ఆషాఢ సు ౧౧ లు శ్రీమహారాజా
ధి రాజ రాజ పరమేశ్వర శ్రీ వీర ప్రతాప శ్రీ అచ్యుత

3\. దేవ మహారాయరు పృథివి రాజ్యంబు సేయుచుండంగాను
శ్రీ అగస్తీశ్వరుని
దివ్య శ్రీ పాద పద్మంబులక్కు ఘండికోట సీమ

4 సుంకలుఁ కాస్యపగోత్ర యజు శాఖాధ్యాయులైన పర్వతరాజు
కొమారుండు మల్లయాను ... ...

5 ... ... ... కొమారుండు వోబు లయ్యాను చితలూరి ... ...
కొమారుండు యల్లయాను ఐబిమ్న అనం

6 తమకైన దండములు సమర్పించి ఇచ్చిన ధర్మ శాసనం స్వామి సంనిధిని అఖండ తి [రు] వళిక వుండెటి అందులకు కట్నం [౹*] ఘుండికోట.

7. సీమలోన మా సుంక [తా] ణ్యాన్కు-చెల్లే [చడిపఱేల] ను మా సుంఖాన్కు చెల్లే [చె] ఖలిగ్రామ కట్నమున్, మగ్గస్తావరాలున్, కోమటి సిద్ధాయం, గాను

8 గసిద్ధాయం, [సింజ]ని సిద్ధాయం, ఇడిగిసిద్ధాయం, గొల్లసిద్ధాయం, వుప్పర సిద్ధాయం, సహాగాను తథాతిథి పుణ్యకాలమందు

9. జరిమ్న త్రివాచకంగాను త్రికరణ సుద్ధిగాను ధారవోసి ఇస్తిమి యిందువల్ల వచ్చే ఆదాయంవల్ల స్వామి సంన్నిధిని తిరువళి కవు

10. ండె ఆట్టుగాను జరిమ్న త్రివాచకంగాను త్రికరణ సుద్ధిగాను తథాతిథి పుణ్యకాలమందు ధారవోసి ఇస్తిమి.

... ... ... ...

ఇందు దానము చేయబడిన సుంకములు

చెప్పల్లి 1. గ్రామకట్నము. (సాముహికముగ రాజునకు చెల్లించవలసినది)

2. మగ్గ స్తావరాలు (సాలెవారి మగ్గములపై విధించు పన్ను)

3. కోమటి సిద్ధాయము (కోమటి వర్తకులపై విధించు పన్ను)

4. గానుక సిద్ధాయము. (తెలికవారి గానుగలపై విధించు పన్ను)

5. సింజిని సిద్ధాయము. (నారితాళ్ళు చేయువారిపై పన్ను)

6. ఇడిగి సిద్ధాయము. (కల్లుగీతవారిపై విధించు పన్ను)

7. గొల్లసిద్ధాయము. (గొల్లవారిపై విధించు పన్ను)

8. ఉప్పర సిద్ధాయము (ఉప్పరివారిపై విధించు పన్ను)

గ్రామీణవృత్తులపై ఈ విధముగ పన్ను లుండెడివని దీనివలన తెలియ చున్నది. ఇట్లే దొమ్మరి పన్ను, మంగలి పన్ను, విప్రవినోది పన్ను మొదలగ పన్నులు కూడ నుండెడివి.

[7]

# 20. ముగింపు

దాదాపు క్రీస్తు 1800 వఱకు అనగా కాకతీయుల రాజ్యాంతమువఱకు గల తెలుగు దేశముయొక్క సాంఘిక చరిత్రను తెలుసుకొనుటకు గ్రంథాధారములేవియులేని కారణమున శాసనములే ముఖ్యాధారములు నన్నయ, తిక్కనల ఆంధ్రమహాభారతమున్నను అది పురాణానువాద మగుటయేగాక గ్రాంథికమగుటచే నాటి జన సామాన్యజీవనమునంతగా ప్రతిబింబించుటలేదు. పండితారాధ్యచరిత్ర క్రీడాభిరామము మున్నగు కొలది రచనలు నాటి సాంఘిక జీవనమును కొంత తెలుపుచున్నవి. తెలుగువారి అప్పటి సాంఘిక విషయము లనేకములు శాసనములనుండియే కాని వేఱు విధముగ మనకు తెలియవు విజయనగర రాజుల కాలమందున్న జీవన వ్యవస్థ, రాజకీయవ్యవస్థ, ఆర్థిక విధానము మత సంప్రదాయములు మున్నగునవి అనేక కైఫియతులలోను, గ్రంథములలోను, విదేశ యాత్రికుల కథనములందు లభ్యమగుచున్నవి. కాని కాకతీయ రాజ్యాంతమువఱకుగల రాజకీయ చరిత్రవలె సాంఘిక చరిత్రను తెలుసుకొనుటకుకూడ శాసనములే యాధారము. అందును తెలుగు శాసనములే తెలుగుప్రజల గ్రామీణ జీవనమును వ్యక్తముచేయును. స్థాలీపులాకముగ కొన్ని యంశములనిట చెప్పుదును.

*1. ప్రజలు :* గ్రామీణప్రజలు జాతుల ననుసరించియేగాక వృత్తుల ననుసరించికూడ సంఘములుగ వ్యవస్థీకరింపబడువారు. ఈ సంఘములకు సమయములులేక శ్రేణులనెడి వ్యవహారముండెడిది. ఆయా సమయములు కొన్ని కట్టుబాట్లు, లేక కొన్ని సాంఘిక వ్యవస్థలద్వారా తమ వృత్తుల నిర్వహించుకొనుటయే గాక జీవిత విధానమునుకూడ సరిదిద్దుకొనెడువారు వారు ఉత్పత్తి చేయు వస్తువుల క్రయ విక్రయములకు సంబంధించిన అంగళ్లు, సుంకములు, లాభములు మున్నగునవికూడ వారి సమయములద్వారా జరుగుచుండెడివని తెలియుచున్నది రాజోద్యోగులు వారిపై విధించు పన్నులను సమయముల పెద్దలద్వారానే వసూలుచేసెడివారు. దానధర్మములు సమయములద్వారానే ఆయా ప్రజల జీవిత విధానములో సమయముల నిర్ణయమే ప్రబల మనిపించును ఎక్కటి, పాంచాల, కుంభాలిక, తంతువాయ, వస్త్రభేదక, తెలిక, దేవాంగ,

గోరక్షక, పరికెల, కిరాత, రజక మున్నగు తెగలవారు వారివారి సమయముల నేర్పాటుచేసికొనువారు ఈ సంఘముల నిర్ణయములు వారి జీవన విధానమును చక్కజేయును ఆ నిర్ణయముల నుల్లంఘించినవారు సమయము విధించు శిక్ష లనుభవించవలెను. అట్టి శిక్షలు సమయదండనములనబడును ప్రజాజీవనము అధికముగ స్థానికవ్యవస్థలద్వారా యంత్రితమగుచుండెడిది

ఆనాటి ప్రజల మత సంప్రదాయములనుగూర్చి తెలిసికొనుటకు శాసనములు మిక్కిలి తోడ్పడును. తెలుగు శాసనములందట్టివనేకముగలవు సామాన్య మనుజుల మత సామరస్యమును తెలుపు కాకతీయులనాటి యీ శాసనము చూడదగును. ఇది బెక్కల్లు (జనగామ తాలూక) గ్రామములోని రుద్రేశ్వ రాలయముననున్నది (క్రీ. 1176 నాటిది).

అమరగ శైవవైష్ణవ నిజారుహ బౌద్ధములైన యిచ్చతు
స్సమయములంబ్రథఙ్మతము సంశయహేతువు దైవమెల్ల నే
కమయని యైక్య భావమున గల్మష దూరుడు మల్లిరడ్డియ
త్యమితగుణాఢ్యుడీ యతులితాయతనంబులు నిల్పె ప్రీతితోన్॥

అని మల్లిరెడ్డి యనునొక సామాన్య కుటుంబి తన కులము జైనము ముఖ్యమతమై యున్నను శైవ, వైష్ణవ, అర్హ (జైన), బౌద్ధములనెడి నాల్గు మతములు కేవల సంశయ హేతువులే కాని దైవమన్నిటనేకమే యను విశ్వాస ముతో తానీ శివాలయమును నిర్మించితినని జెప్పుకొనెను. ఇట్టి మత సమరస భావమే తెలుగునాట అనాదినుండి యున్నది కనుక మతోన్మాదములేవియు తల యెత్త లేదు.

కాకతి రుద్రుని మంత్రియగు వెల్లకి గంగాధరుడు తానుచేసిన అనేక ధర్మకార్యములలో శివాలయములు, ప్రసన్న కేశవాలయములు నిర్మించుట అనుమకొండలో జైన వసతిని బాగుచేసి నూతనముగ జేయుట, బౌద్ధాలయ మును నిర్మించుట చేరియున్నట్లు శాసనములుగలవు.

కం. పరమేశుడు హరి బుద్ధ
స్వరూపుండై యసురవరుల వంచించుట నా
హరి యనియ పట్టశాలం
జిరముగ బుద్ధ ప్రతిష్ఠ సేసితి భక్తిని ॥

(కరీంనగర శాసనము)

ఇదే విధముగ ధరణికోట నేలిన కోటరాజులుకూడ నచటి బౌద్ధక్షేత్రము నకు దానములొసగినట్లు శాసనములుగలవు. వేల్పూరులో వారు నిర్మించిన శివాలయములు, అమరావతిలోచేసిన శివ ప్రతిష్ఠలు శాసనములు నిరూపించు చున్నవి.

సంస్కృత శాసనములందు పేర్కొనబడనట్టి సుంకములు అనేకము తెలుగు శాసనములలో కనిపించును. ఈ సుంకములు అనాటి ఆర్థిక విధానమును గూర్చి తెలుసుకొనుటకు తోడ్పడును. శకము 1839 నాటి గిద్దలూరు తాలూక సలకలవీడు గ్రామశాసనమొకదానిలో ఆ గ్రామమునకు చెందిన యీ దిగువ నుదహరించిన ఆదాయము లన్నింటిని కాకతి ప్రతాపరుద్రదేవుని యనుమతిన దేవరి నాయనింగారు శ్రీరంగనాథదేవునికి దానమొసగినట్లు చెప్పబడెను వంగతప్పు, కటి, కొల్చు, వంను, కానిక, పుల్లరి, సాదము, సుంకము, తలారి కానిక, సుంకెకానిక, పుల్లరికానిక, దరిశవకానిక, పవిత్రకానిక, అని 13 విధము లగు పన్నులు పేర్కొనబడినవి. వీటిలో నేయొక్కటి సరిగా మనకిపుడు తెలి యదు. ఇవిగాక మరికొన్ని పన్నులుకూడ వేరే శాసనములందుగలవు. పుట్టు పేరు సుంకము, వడ్డరావుళ సుంకము, బీరణాలు, అరి,అప్పనము,మగ్గరి, వృత్తి సుంకములు, అంగడి సుంకములు అనేకము పేర్కొనబడుచుండును. వీటిలో కొన్ని రాజ సుంకములు, మఱికొన్ని గ్రామసుంకములు. తరువాతి విజయనగర రాజులుగూడ ఈ సుంకములన్ని ప్రజలనుండి రాబెట్టెడువారు. వీటిలో ననేకము వస్తురూపములో నుండెడివి.

ప్రజాసామాన్యమునకు జెందిన జీవనవ్యవస్థ తెలుగులో వ్రాయబడిన శాసనములలోనే అధికముగ తెలియవచ్చును. కాని యీ శాసనములు అనాటి గ్రామ్యభాషలో నుండుటవలన నేడు మనకు సులభముగ అర్థముకావు అప్పటి పన్నులు, కొలతలు, తూనికలు, నేలల సేద్యవిధానములు, వృత్తులు, పరిపాలన, యుద్ధములుచేయు విధము, మత సంప్రదాయములు మున్నగు విషయములు శాసనములద్వారా తెలియవచ్చును. అప్పటి గ్రాంథికభాష గ్రంథములలో తెలియుచున్నను వ్యావహారికభాషను తెలుసుకొనుటకు శాసనములే అధారము గనుక తెలుగుభాషా శాస్త్ర విజ్ఞానమునకు శాసనములు మిక్కిలి తోడ్పడును.

卐

# దేశభాషలందు తెలుగు లెస్స








## ప్రపంచ తెలుగు మహాసభలు

**1975 ఏప్రిల్ 12—18**